# బీదవిద్యార్థి, బి. ఏ.,

## సాంఘిక నాటకము.


రచయిత :

శ్రీ హేలాపుర నివాసులును, ఉభయభాషావిశా
రదులును కీ॥ శే॥ బ్రహ్మశ్రీ కవిపండిత
కలువలపల్లి రంగనాథశాస్త్రిగారి
శిష్యుడు

**మారిశెట్టి సత్యనారాయణ**

ఏలూరు.







ఏలూరు

శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

మొదటికూర్పు 1000 ప్రతులు.

**1939**





[వెల రు 0-8-0

# బీదవిద్యార్థి, బి. ఏ.,

## సాంఘిక నాటకము.


రచయిత :

శ్రీ హేలాపుర నివాసులును, ఉభయభాషావిశా

రదులును కీ|| శే|| బ్రహ్మశ్రీ కవిపండిత

కలువలపల్లి రంగనాథశాస్త్రిగారి

శిష్యుడు

**మారిశెట్టి సత్యనారాయణ**

ఏలూరు.







ఏలూరు

శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

మొదటికూర్పు 1000 ప్రతులు.

**1939**





[వెల రు 0-8-0

శ్రీ హేలాపుర నివాసులును, ఉభయభాషా విశారదులును,
మద్గురూత్తములునయిన
బ్రహ్మశ్రీ కవిపండిత కలువలపల్లి రంగనాథశాస్త్రిగారు
ది 3-1-1939 తేదీని దివంగితులైనసందర్భమున విడువబడిన

# అశ్రుతర్పణము.

గీ॥ జ్ఞాన విద్యాసముద్ర వి • జ్ఞాననిలయ
అమల కలువలపల్లి వం • శాబ్ధిచంద్ర
సాధుజనమిత్ర శ్రీరంగ • నాథశాస్త్రి
సుతు, సుతల, బంధుమిత్రుల • వెతనుముంచి
హాస్తమించితె మద్గురూ • ఆంధ్రభూమి. 1

గీ॥ శిష్యపరమాణువుల మునీ • సేవకులము
మేము జీవించుదనుక నీ • మేదినితలి
చెలగి మృతజీవివై ప్రకా • శింతుగాదె
భవ్య సత్కీర్తిచంద్రికల్ • భరతభూమి
బరిఢవిల్లగ మద్గురూ • బ్రహ్మతేజ. 2

గీ॥ చరమదశగాని పుట్టుక • జాడలేని
దివ్యతరమహాశచీపతి • దేవగురువు
సభను శాస్త్రార్థచర్చల • జరుపనేడు
సరగినాడవె మద్గురూ • అమరపురికి. 3

గీ॥ మీరుబెట్టినభిక్ష మీ • తీరునాకు
గౌరవంబును జేకూర్చి • కవులలోన
చిన్నవాడనేనొకడంచు • జెప్పుకొనగ
స్థానమొసగెను మద్గురూ • త్తమచిరంబు. 4

గీ॥ జనములెల్లరిహృదయముల్ • ఝల్లుమనగ
కూర్మి సేలూరుపురమున • గొట్టుమూరు
నిండు పండితకవులు క • న్నీరుగార్చ
హాస్తమించితె మద్గురూ • ఆంధ్రభూమి. 5

# బీదవిద్యార్థి బి. ఏ.,

## ఐదంకముల నూతన సాంఘిక నాటకము.

---

:: రచయిత ::

హేలాపురనివాసులు మారిశెట్టి శ్రీరాములు సుబ్బమాంబా పుత్రుడును,
శ్రీ హేలాపుర నివాసులగు నాగిరెడ్డి రామదాసుగారి బావమరదియును,
శ్రీ హేలాపురనివాసులును, ఉభయభాషా విశారదులైన బ్రహ్మశ్రీ కవిపండిత
కలువలపల్లి రంగనాథశాస్త్రిగారి శిష్యుడును, శ్రీ కాకినాడపట్టణ
జగన్నాథపురవరవాసిని జగన్మాత శ్రీ కొండారు సత్యదేవతా
వరప్రసాద లబ్ధ కవితావిలాస

**మారిశెట్టి సత్యనారాయణ-ఏలూరు.**

:: పరిశోధకులు ::

డాక్టరు, యం. అంగముత్తు మొదలియారుగారు, శికింద్రాబాదు.
అక్కావఝ్ఝల వెంకటప్పయ్యశాస్త్రిగారు, మహాదేవపల్లి.

మొదటికూర్పు 2000 ప్రతులు.

శ్రీ పాండురంగ [illegible] ముద్రాక్షరశాల, ఏలూరు.

 [వెల ౦-౮-౦]

శ్రీ కాకినాడ పట్టణ జగన్నాథపురవరవాసిని జగన్మాత

# శ్రీ కోఁరారు సత్యదేవతాస్తవము.

ఉ. శ్రీరమణీలలామ యయి ♦ జెల్వుగ భాగ్యమునిచ్చివాణివై
కోరినవిద్యలిచ్చి భవు ♦ కోమలి భార్గవివై జయంబు వి
స్తారమొసంగి బ్రోచుదయ ♦ శాలిని యోజగదంబవీవె ఈ
ధారుణి కాకినాడపుర ♦ ధామనివాసిని సత్యదేవతా.

చ. పసితనమందు విద్యయొల ♦ బ్రాయమునందు సతీసుతాదులన్
యొసగియు మధ్యకాలమున ♦ నొప్పగుపెద్దలసేవ వృద్ధతన్
యసమతరంపు భక్తి తగ ♦ నవ్వలముక్తినొసంగుదివెగా
వసుధను కాకినాడపుర ♦ వాసిని పావని సత్యదేవతా.

ఉ. నీదయచేతవ్రాసితిని ♦ నేర్పుననింతకునాల్గుపొత్తముల్
మోదము మీర నచ్చుబడె ♦ ముందుగభక్తులచేతనింక పై
నన్ దగజేయుమంబ కృప నన్ను ♦ శతాధికగ్రంథకర్తగా
మేదినిసజ్జనాళి కడు ♦ మెచ్చియు దీవనలీయ మోక్ష సం
పాదిత కాకినాడ వర ♦ పట్టణవాసిని సత్యదేవతా.

ఉ. ఈ మహిశూద్రవర్ణమున నింపుదలిర్పగ మారిశెట్టి శ్రీ
రాములు సుబ్బమాంబ కల ♦ రారెడిపుత్రుడనై జనించిన
శ్రీ మహారంగనాథగురు బ్రేమకు పాత్రుడనై కవిత్వ శి
క్షామతినంది నీకృపను ♦ గంటిని యో జగదంబ మోక్షసౌ
దామిని కాకినాడ పుర ♦ ధామని వాసిని సత్యదేవతా.

ఉ. చెప్పెదనీకటాక్షము వి ♦ శేషము నాపయినుండకబ్బముల్
చెప్పుటలో విశేషమొక ♦ చిన్నముగల్గునె నాదుజిహ్వపై
[illegible]ది ♦ యేనినుగోరెద వేడెదన్ సదా
[illegible]పుర ♦ ధామనివాసిని సత్యదేవతా.

# కృతిపతి.

శ్రీ హేలాపుర నివాసులు— సుజనవిధేయులు

ఏనుగ రంగయ్యగారు.

ఉ॥ శ్రీరమణీవిభుండు హరి ♦ జెల్వుగ బ్రోచుత నెడ్డు నిన్ననీ
వారిని పుత్త్రపుత్త్రికల ♦ వంగడముం-దగు కాపుబిడ్డవౌ
టారసి నిన్వరించె విజ♦యంబనుమత్కృతికన్యయెంతయున్
గూరిమినెల్లదిక్కులకు ♦ గుప్పి భవద్యశచంద్రికల్ సదా
ధారుణి నేన్గువంశశశి ♦ ధన్యచరిత్రుడ రంగయాఖ్యుడా.

చ॥ జనకుడుసోమయాఖ్యునకు♦సాధుశిరోమణి రత్తమాంబకున్
తనయుడవై జనించియును ♦ తద్గుణమెల్లను దీర్చికీర్తిచే
గొని సతివెంకయమ్మనతి♦గూరిమి బెండిలియాడియోగ్యులౌ
తనయుల బుత్త్రికామణుల♦ తద్దయుగాంచిననిన్ను కావ్యపుం
వనితవరించెనేడు తన ♦ వల్లభుగాగను రంగయాఖ్యుడా.

ఉ॥ ఏపగు భాగ్యభోగ్యముల♦ వెన్నియొగల్గినసుంతప్రజ్ఞమున్
జూపని శాంతమూర్తి వెటు♦ జూచిననీకడ నారవంతయున్
కోపముగానరాదు కడు ♦ కోవిదమాన్యుడ నీకతంబునన్
కాపుకులంబువన్నెయును♦గాంచెను-ఏనుగురంగయాఖ్యుడా.

చ॥ అరయగ రామలక్ష్మణుల♦యట్టికుమారులు నీదుయాజ్ఞలో
వరలెడు రామరావు గుణ♦వంతుడు శాంతుడు వీరరాఘవుల్
స్థిరతర భక్తినీకు తగు ♦ సేవలజేసెడి పుత్త్రికామణుల్
బరగెడు పాడిపంటలచె♦ భాసిలు పృథ్విని మత్కృతీశ్వరా.

ఉ॥ పెద్దలసేవయందు నిరు ♦ పేదలజూచుటయందు గూర్మినీ
యొద్దనెగల్గు శ్రీపతిని ♦ నోస్పుగ నమ్మి భజింతు వీధరిన్
పెద్దగ వంశవృక్షమును ♦ బెంచియు తామరతంపరట్లు సం
పద్దశ నేలు శౌరినిను ♦ బాగుగ-ఏనుగరంగయాఖ్యుడా.

ఈబీడ విద్యార్థి-బి-ఏ-నాటకరచనాప్రోత్సాహక మిత్రద్వయము
ఏనుగు రామారావుగారు-మధ్యాహ్నపు సుబ్బారావుగారు.

—♦ ఏలూరు ♦—

శా॥ శ్రీమద్దేశ్వరి సత్యదేవతకృపా • సింధుండు రాముండు మేల్
శ్రేమన్ సంతతిభాగ్యభోగములతో • బెంపందమిత్రద్వయిన్
క్షేమంకర్యులజేసి యాశ్రితుల వా • సిన్ మించ బ్రేమించుచునీ
రామారావును-సుబ్బరావును సదా • రక్షించునీధారుణిన్.

[illegible] వి • శేషతరంబగు మైత్రితోడ మీర్
రప్పుడు సంచరించు[illegible] యెంతయు శ్రేయముధారుణీస్థలిన్
గొప్పగుమైత్రికిన్ దగిన • కూర్మి ద్రవ్యము లేమశీలమున్
దప్పని రామరావుకడు • ధన్యుడవీవును సుబ్బరావునున్.

ఉ॥ మీదగు మిత్రులందరిచె • మేలుదలిర్పగ మీరలిర్వురన్
నాదగు నాటకంబున క • తారతమున్ శ్రమలందిముద్రణం
బున్ దగ సల్పినారలతి • బూనిక క్షీరమునీరమట్లుగా
మేదిని [illegible]దు మైత్రిగడు • మించనొనర్చుత రాము డెప్పుడున్.

క॥ కావ్యరసగ్రాహణంబును
శ్రావ్యతరంబైనయట్టి • సద్[illegible]
ద్రవ్యము దాతృత్వంబును
భావ్యముగ నొసంగియున్న • భవుడేలుసదా.

గీ॥ ఎలమి కృష్ణార్జునుల యట్లు లెసగిమసగి
మీరలిర్వురు మిత్రులై • మేదిని తలి
చిరము వంశాభివృద్ధిగా • వరలుడయ్య
రమ్యమతి - సుబ్బరావు - శ్రీ రామరావు.

# ఈనాటకము నచ్చు వేయించిన దాతలు.

1 గుజ్జుచిట్టి వెంకోజీగారి కుమారుడు-హీరోజీరావుగారు,
క్లాత్ మర్చంటు-ఏలూరు 5—0—0

2 కరారె లక్ష్మాజీగారికుమారుడు-నరుసోజీరావుగారు,
క్లాత్ మర్చంటు-ఏలూరు 5—0—0

3 కొనకళ్ళ రంగశాయిగారు ఏలూరు

4 దొంతు సుబ్బారావుగారు డిటో

5 [illegible]మపల్లి ఆంజనేయులు-సింహాద్రికృష్ణారావుగార్లు డిటో

6 [illegible] విశ్వనాథంగారు డిటో

7 [illegible]సనాథంగారు డిటో

8 చీమ[illegible]ల్లిఖార్జునరావుగారు డిటో

9 మద్దుల [illegible]రావుగారు డిటో

10 మద్దుల వెం[illegible]టశేషావతారంగారు డిటో

11 పాలేటి నరసింహ్వారావుగారు డిటో

12 గుజ్జు సూరోజిరావుగారు-ల్యాండలార్డు డిటో

13 వేమూరి నాగరత్నంగారు, పచారివర్తకులు-ఏలూరు. 2—0—0

14 జనపరెడ్డి వెంకటస్వామి, సింహాచలంగార్లు డిటో 2—0—0

15 పులి సుబ్బారావుగారు-జాలిపూడి 2—0—0

17 పెనుగొండ శ్రీరాములుగారు. ఏలూరు 1—0—0

[illegible] కోటలింగ[illegible]రు డిటో 1—0—0

[illegible] [illegible]వుగారు డిటో 1—0—0

19 రాయపరపు అప్పాస్వామిజమిందారుగారు, ఆనరబుల్
మాజిస్ట్రేటు-ఏలూరు 1—0—0

20 కురుమ అచ్చయ్యలింగంగారు-పత్తేబాద 1—0—0

21 ములకల పంచాక్షరిగారు డిటో 1—0—0

22 యర్రా భీమలింగంగారు డిటో 1—4—0

23 దంతం రామలింగంగారు డిటో 1—0—0

24 ఉప్పల చిన్నబసవయ్యగారు డిటో 1—0—0

| | | |
|---|---|---|
| 25 | యక్కల రుద్రమూర్తిగారు-పత్తేబాద | 1—0—0 |
| 26 | చోడే సుబ్బారావుగారు-ఏలూరు | 1—0—0 |
| 27 | సామర్ల బసవయ్యగారు-జాలిపూడి | 1—0—0 |
| 28 | అలుగోలు గంగరాజాచార్యులుగారు-ఏలూరు | 1—0—0 |
| 29 | మదుపల్లి వీరరాఘవగుప్తగారు డిటో | 1—0—0 |
| 30 | గ్రంధి బాపిరాజుగారు డిటో | 1—0—0 |
| 31 | తవ్వ సత్యనారాయణగారు డిటో | 1—0—0 |
| 32 | కోనే మాధవరావుగారు డిటో | 1—0—0 |
| 33 | కాకొల్లు సింగయ్యబ్రదర్సువారుడిటో | 1—0—0 |
| 34 | శిరం సూర్యంగారు డిటో | 1—0—0 |
| 35 | వేరాబత్తుల గంగయ్యగారి కుమారుడు, సూర్యనారాయణగారు-పోణంగి | 1—0—0 |
| 36 | కోలా రామచంద్రరావుగారు-ఏలూరు | 1—0—0 |
| 37 | ఉమ్మడిసింగు నారాయణరావుగారి కుమారుడు, వెంకటరమణ వరప్రసాదరావుగారు-ఏలూరు | 1—0—0 |
| 38 | శీర్ల బ్రహ్మయ్యగారు, హిందీవిశారద-ఏలూరు | 1—0—0 |
| 39 | పందుల గంగయ్యగారు-జగన్నాధపురం | 1—0—0 |
| 40 | సంకాబత్తుల నారాయణస్వామి-అండ్-సన్సువారు-ఏలూరు. | 1—0—0 |
| 41 | నంగులూరి సూర్యప్రకాశరావుగారు డిటో | 1—0—0 |
| 42 | పసుపులేటి రామమూర్తిగారు డిటో | 1—0—0 |
| 43 | శ్రీరామకృష్ణా టైలరింగ్ హోమ్-చల్లారి శేషయ్యగారు డిటో | 1—0—0 |
| 44 | పసుపులేటి పాపారావుగారు డిటో | 1—0—0 |
| 45 | తుమ్మల శివయ్యగారు డిటో | 1—0—0 |
| 46 | చల్లా సుబ్బారావుగారు డిటో | 1—0—0 |
| 47 | మాంతే బసవయ్యగారు డిటో | 1—0—0 |
| 48 | గట్టుపల్లి రాఘవులు, తూనుగుంట్లరామసత్యంగార్లుడిటో | 1—0—0 |
| 49 | కమ్మల సుబ్బయ్యగారు డిటో | 0—8—0 |
| 50 | సింబతిని అప్పారావుగారు డిటో | 0—8—0 |

51 జొన్నలగడ్డ వెంకటసుబ్బయ్యగారు ఏలూరు 0—8—0
52 మద్దెల వీరవెంకటసుబ్బారావుగారు డిటో 0—8—0
53 సుగ్గిసెట్టి శ్రీరాములుగారు డిటో 0—8—0
54 మాజేటి సుబ్బారావుగారు డిటో 0—8—0
55 పేరూరి బాపిరాజుగారు డిటో 0—8—0
56 గుజ్జు బుచ్చయ్య-బట్టు మణిరాజుగార్లు ఏలూరు 0—8—0
57 ఆది రాఘవులుగారు డిటో 0—8—0
58 కురమ సూర్యప్రకాశరావుగారు పత్తేబాద 0—8—0
59 మాన్యం శేషగిరిరావుగారు పత్తేబాద 0—8—0
60 మేరువు సుబ్బారావుగారు తోటగూడెం 0—8—0
6[illegible] [illegible]కిల ధర్మలింగస్వామిగారు ఏలూరు 0—8—0
[illegible] [illegible] సోమయ్యగారు డిటో 0—8—0
63 [illegible]టస్వామిగారు ఏలూరు గాంధినగరం 0—8—0
64 మహ [illegible] ఇసాక్ గారు ఆదివార్పేట-ఏలూరు 0—8—0
65 తమ్మన [illegible] వెంకటరత్నంగారుడిటో 0—8—0
66 పువ్వాల సోమరాజుగారు డిటో 0—8—0
67 రెడ్డినారాయణరావు-నుల్లింగల మాణిక్యంగార్లు డిటో 0—8—0
68 వాకచర్ల రాజేశ్వరరావుగారు డిటో 0—10—0
69 వి. యస్. పి. రావుగారు డిటో 0—8—0
70 చెరుకూరిశ్రీరాములుగారుస్టేషనుమాష్టరు-రుక్మాపూరు 0—8—0
71 కంకిపాటి రంగారావుపోకూరి కోటయ్యగార్లుఏలూరు 0—8—0
72 ఉడతా శోభనాచలంగారు డిటో 0—8—0
[illegible] రెడ్డి వీర[illegible]గారు డిటో 0—8—0
[illegible] అక్కుల కనకవెంకటేశ్వరరావుగారు డిటో 0—8—0
75 కట్టి సింహాచలంగారు గాంధినగరం డిటో 0—8—0
76 జోరిగే నాగన్నగారు డిటో 0—4—0
77 గుజ్జరు ఫిరోజీరావుగారు డిటో 0—4—0
78 సి. గోపాలకృష్ణానందరావు-సి. నారాయణరావు డిటో 0—4—0
79 దొంగల బలరామస్వామిగారు డిటో 0—4—0
80 మట్టాలక్ష్మయ్యగారు డిటో 0—4—0

| | | | |
|---|---|---|---|
| 81 | మేడిది శ్రీనివాసాచార్యులుగారు-పలూరు | | 0—4—0 |
| 82 | గొల్ల సింహాద్రిగారు | డిటో | 0—4—0 |
| 83 | పలుకూరి సూర్యనారాయణగారు | డిటో | 0—4—0 |
| 84 | బచ్చు సుబ్బారావుగారు | డిటో | 0—4—0 |
| 85 | సబ్బవరపు వెంకటాచార్యకవిగారు | డిటో | 0—4—0 |
| 86 | సబ్బవరపు వెంకటరత్నంగారు | డిటో | 0—4—0 |
| 87 | చిక్కా వీరన్నగారు | పత్తేబాద | 0—4—0 |
| 88 | కర్నా జ్ఞానకోటయ్యగారు | డిటో | 0—4—0 |
| 89 | పడాల సుబ్బారావుగారు | డిటో | 0—4—0 |
| 90 | ములకల చిన్మయలింగంగారు | డిటో | 0—4—0 |
| 91 | పృథివి బాలగంగాధరరావుగారు | డిటో | 0—4—0 |
| 92 | బళ్ళ కనకయ్యగారు | డిటో | 0—4—0 |
| 93 | సిద్ధాబత్తుల శ్రీరాములుగారు | పేలూరు | 0—4—0 |
| 94 | బొర్రా వెంకటజలంగారు | డిటో | 0—4—0 |
| 95 | సాతపల్లి చిన్నసుబ్బయాచార్యులుగారు | గొమ్ములూరు | 0—4—0 |
| 96 | దారపురెడ్డి రామచంద్రరావుగారు | మహాదేవపల్లి | 0—5—0 |
| 97 | నారా నాగేశ్వరరావుగారు | పేలూరు | 0—5—0 |
| 98 | చింతా వీరాస్వామిగారు | డిటో | 0—5—0 |
| 99 | పులి కృష్ణారావుగారు | డిటో | 0—5—0 |
| 100 | దాయిరెడ్డి రాఘవరావుగారు | డిటో | 0—5—0 |
| 101 | వాకచర్ల రామయ్యగారు | డిటో | 0—4—0 |
| 102 | వాకచర్ల మాణిక్యంగారు | డిటో | 0—4—0 |
| 103 | దున్నా చినరామయ్యగారు | డిటో | 0—4—0 |
| 104 | గుజ్జరు లక్ష్మోజీరావుగారు | డిటో | 0—4—0 |
| 105 | ముదపల్లి వెంకటరత్నంగారు | డిటో | 0—4—0 |
| 106 | చెరుకుతోట రాఘవరావుగారు | డిటో | 0—4—0 |
| 107 | తాడ్డి అచ్చియ్యగారు గాంధినగరం | డిటో | 0—4—0 |
| 108 | పెనుగొండ అప్పారావుగారు | డిటో | 0—1—0 |
| 109 | అంగర శ్రీరామమూర్తిగారు | డిటో | 0—4—0 |

# ఇందలి పాత్రలు.

## పురుషులు

1. రాజారావు — బీ.ఏ. విద్యార్థి. బి.ఏ., కథానాయకుడు.
2. శంకరరావు — రాజారావు తండ్రి, నిరుపేద.
3. వెంకటరావు — లక్షాధికారి. అన్నసత్రనిర్మాత
4. మాధవరావు — వెంకటరావు పుత్రుడు. బీ.ఏ. విద్యార్థి క్లాసుమేటు.
5. షణ్ముఖుడు — జమీందారు కొడుకు.
6. మునిసిపల్ బిల్ కలెక్టరు.
7. టీచరు.
8. ఆనందరావు — వకీలు. శకుంతల తండ్రి.
9. రామారావు — కాఫీహోటలు యజమాని.
10. విలాసరావు — శ్యామల అన్న, రామారావు పుత్రుడు.
11. డిస్ట్రిక్టు మున్సబు కోర్టు — హెడ్ గుమాస్తా.
12. వినోదరావు — షణ్ముఖునివలన బాగుపడిన మిత్రుడు.
13. భీమారావు — షణ్ముఖుని వకీలు.
14. గంగారావు — రామారావు వకీలు.
15. అవధాని
16. వెంకయ్యకాపు
17. జగ్గుశెట్టి

(15–17) ఈ ముప్పురును రంగనాయకి విటులు.

18. ఢాపరుజాకీ — రంగనాయకికి విటుల దార్చువాడు.
19. మునసబుకోర్టు డలాయితు.

## స్త్రీలు

1. శకుంతల — కథానాయిక, రాజారావు భార్య, విద్యావతి.
2. శ్యామల — శకుంతల క్లాసుమేటు, మాధవరావు భార్య.
3. రంగనాయకి — వేశ్య.

# తొలి దృశ్యము.

[రాజబాట—బీదవిద్యార్థి రాజారావు ప్రవేశించి]

ప॥ ఆదరించండయ్యా మీరు । ఆశ్రయించితినయ్యా నేను। ఆద॥

అ॥ బీదవిద్యార్థిని సనయుఁడై । నాదు దుస్థితి కినుల జూచియు
లేదుపొమ్మని కసరికొట్టక । మీదు తనయునిమాడ్కి నన్నిపు॥డా॥

చ॥ కట్టుకొనగా గుడ్డలేదు । పొట్టకింత గంజలేదు
ఇట్టి దీనుని వారములుభుజి । యింప మీ మీ యిండ్లలోనికి॥ ఆద॥

చ॥ జాలిదలచెడి హితులులేరు । చదువుకొన పాత్రములు లేవు
స్కూలుజీతంబీయజాలని । బాలుఁడని కడు జాలిజెందియు॥ ఆద॥

ఓ ధర్మాత్ములారా! నాకొక దారిజూపి పుణ్యమును గట్టుకొనుడు.

సీ. మాతృహీనుఁడ దిక్కు ♦ మాలినవాఁడ న
న్నరసి రక్షించుఁడో ♦ యయ్యలార
ఆకటిబాధకు ♦ నాగలేకుంటి నన్
దయఁదలంచుఁడు క ♦ న్నతండ్రులార
జీర్ణవస్త్రము లు మా ♦ సెను కట్టుకొన మ రు
బట్టలిప్పించుఁడో ♦ ప్రభువులార
భువి సుకృతముగూర్చ ♦ నవు సువిద్యను నాకు
దానంబుసేయుఁడో ♦ దాతలార

గీ. పట్టెడన్నము పెట్టగా ♦ బొట్టలోనగి
యరసి తమ్మునివలెఁజూచు ♦ డక్కలార
దయగలిగినట్టి నను గన్న ♦ తల్లులార
వీరసామ్రాజ్యమణులార ♦ వెలదులార
ఆంధ్రగృహలక్ష్ములార నా ♦ యమ్మలార.

(ఒక గుమ్మముకడ నిలచి) బాబూ! బీదవిద్యార్థిని. మీకు చేతనైనసాయము చేయవచ్చును. (లోననుండి యిది యన్నసత్రము గాదు పొమ్మావంకు) చిత్తము తండ్రీ పోదను (వేరొకగుమ్మముకడ నిలచి) తల్లీ! నే నొక బీదవిద్యార్థిని. (లోననుండి నాయనా! లోనికిరమ్ము) ఆహా! చల్లనితల్లీ! మీ స్త్రీహృదయము నవనీతము గదా!

(నిష్క్రమించును.)



# బీదవిద్యార్థి, బి. ఏ.,

[ సాంఘిక నాటకము ]

## ప్రథమాంకము.

### ప్రథమరంగము.

(వెంకటరావుమేడ - వెంకటరావు కూర్చొనియుండ - మాధవరావు నిలుచియుండ తెరలేచును).

వెంక—కుమారా! నీ ప్రవర్తనలెవ్వియును బాగుండలేవు! నిష్కారణముగా ధనము హెచ్చించుటయే గన్పించుచున్నది; గాని, నీవు కష్టపడి చదివి ప్యాసగుట కన్పించుటలేదు. ఫోర్తుఫారమునందే ముమ్మారు దండయాత్రలను సలిపితివి. తోడివారలను జూచిన నీకు సిగ్గయిన నుండవలదా? నీ వా చపటపన్ముఖుని స్నేహమును వీడవా? నీ మిత్రుడగు రాజారావును జూడుము. ఎంత గుణవంతుడో కదా! నిరుపేదయైనను వారములు భుజింపుచు, పుస్తకములకు, వస్త్రములకు, పలువురను యాచించు ప్రతి సంవత్సరమును ప్యాసగుటలేదా? అతని క్లాసుమేటువైయుండియు, నీ వెంత వెనుకబడిపోతివో, నిన్నుజూచి యెందరు నవ్వుచుండిరో, నీ వించుకైనను గమనించితివా? అందువలన నీకు పెండ్లియు వచ్చినది.

సీ॥ మనము ధనికులమైనంత ♦ మాత్రముననె
అరయ ! విద్యావిహీనుండ ♦ వైననీకు
నల్లునౌదువురమ్మని ♦ యీ దరమున
పిలచి యెటుపిల్లనిత్తురు ♦ పిచ్చివాడ.

ఐనను, భాగ్యవంతుల పుత్రులెల్లరును, నీవలె గర్వోన్మత్తచిత్తులై విద్యావిషయికమున విముఖులై, దుర్వ్యసనముల దగుల్కొనుట సహజము.

సీ. వారముల్ భుజియించి ♦ వస్త్రముల్ యాచించి
పదువురకాళ్ళను ♦ ఒట్టిపట్టి
పొత్తముల్ గొనలేక ♦ పోయి సిగ్గనబోక
దీనతనెల్లర ♦ దేవురించి
స్కూలు జీతంబీయ ♦ జాలక తమ యుధి
కారిల పంచల ♦ దాగితారి
చదువ నేపను బడ్డి ♦ చమురులేకను మున్సి
పలు లాంతరులకడ ♦ నిలబిచదివి

గీ. నేటి వారలు మేటి వి ♦ ద్యాంసులగుచు
పెద్ద యుద్యోగములనంది ♦ పేరుగాంత్రు
తనర నినుబోలుధనికుల ♦ తనయు లిట్టుల
పాడగుచునుందురెందుకు ♦ బసికిరాక.

ఈ సంవత్సరము పరీక్షలో గెలుపొందితివా సరియే. లేక గతవత్సరములవలె ప్యాసైతివా నిన్నిక క్షమింపజాలను, జాగ్రత.

మాగ— తండ్రీ ! ఇంకపై బుద్ధిగలిగి శ్రద్ధతో చదివెదను.

వెంక— మంచిది ! ఏకపుత్రుడవనుమాట మరువకుము ! విద్యావిహీనుడవైనచో యీ సమస్తవ్యాపారము లెట్లు చక్కబెట్టుకొనగలవు ? ఎంచి పంచుకొనువారు నీకెవ్వరును లేరు. విద్వాంసుడవై కృషిజేసి యశ మార్జించి వంశము నుద్ధరింప యత్నింపుము.
(నిష్క్రమించును.)

మాధ—నాతండ్రి వెఱ్ఱియేగాని, ఇంతధనికులము! నేను చదువుకొనన నంతమాత్రమున వచ్చిన లోపమేమి?

గీ. కలిమిలేకున్న లోపంబు ♦ గల్గుగాని
విద్యలేకున్న లోప మ♦ న్పించునొక్క
వేయి లోపంబులనుగప్పి ♦ వేయునట్టి
ధనముగలిగిన నరులకు ♦ తక్కువేమి.

శరీరమంతయు నలసిపోవునట్లు కష్టపడి యెందులకు చదువ వలయును? కూటికి గుడ్డకు లేకున్నవారు గదా! ఊరకే తెగచదివి యుద్యోగముల సంపాదించుకొనవలయుననెడు తలపు? నాకంతటి కర్మమేమి పట్టినది.

గీ. ఎంచ నీయూరమున్నూర్ల ♦ మించినట్టి
ధనికులే లేరుభువి భాగ్య ♦ ధనునిమొగము
తెలుపునిర్ధను మొగమెన్న ♦ నలుపుధనము
సకల కార్యంబులను చేయ ♦ జాలదొక్కొ.

నాకడనెన్ని యవగుణంబులున్ననేమి? నేను చదువకున్ననేమి? నేనొక లక్షాధికారి పుత్రుడను! నాకు పిల్లనీయనివాడెవడు? నేను కోరవలయునేగాని, ఊరిలోనివారు తమకన్యలను దెచ్చి నాకాళ్ళపై బడవేయునపుడు నేజూచెదగాక.

(నిష్క్రమింప తెరబడును.)

---

## —♦ ద్వితీయ రంగము. ♦—

(వకీలు ఆనందరావు భవనము - ఆనందరావు కుర్చీపై గూర్చునియుండ తెరలేచును.)

రాజారావు—(ప్రవేశించి) అయ్యా! నమస్కారములు. మీపరిపూర్ణానుగ్రహమున నేను స్కూల్ ఫైనల్ పరీక్షలో రాజధానిలోకెల్ల ప్రథమ శ్రేణిలో నుత్తీర్ణుడనైతిని.

ఆనం—సంతోషము. మేము నీకు జేసిన సాయమును సార్ధకమునకు దెచ్చితివి. బీదవిద్యార్థివై నను ప్రశంసార్హుడవైయుఁడువు.

రాజా—చిత్తము! అనుగ్రహింపబడితిని. మీ యట్టి యుదారహృదయుల మూలకమున మాబోటి దీనులందరు విద్యావంతులై మీవంటివారి కీర్తిని గొనియాడుచు నుద్యోగముల సంపాదించి, విద్యామతల్లికి వన్నె బెట్టుదురుగాక.

చ. కనుగొన దేశమాతనయ ♦ గణ్యచరిత్ర పవిత్రలోక పా
వని కరుణాలవాల తన ♦ పావనగర్భమునందు యెప్పుడున్
గనియెడుగాక లోకహిత ♦ కారులునౌ మిముబోటిదాతలన్
యనఘచరిత్ర నాదు సము ♦ లైన దరిద్రుల నుద్ధరింపగా.

అయ్యా! తాము నాకిపుడు గొప్ప సాయము జేయవలయును. నాబట్టలన్నియును చినిగిపోయినవి. కట్టుకొనుటకు మరొ బట్టలేదు! యింకను కొన్ని పుస్తకములుగూడా కావలయును.

ఆనం—మంచిది! యీ పైకమునుగొనిపోయి దుస్తులను, పుస్తకములను కొనుము. చింతింపకుము! యెద్దియైన కావలసినయెడల సిగ్గుపడక మరలవచ్చి నాకు కన్పింపుము. (పైకమునిచ్చి) జాగ్రత శ్రద్ధ గలిగి చదువుకొనుము.

రాజా—చిత్తము! మహాప్రసాదము-మీయుపకారము మరువదగినది కాదు-నా జీవితపర్యంతమును మీకు నేను విధేయుడను. పోయి వచ్చెదను సెలవు. దయయుంచుడు (నిష్క్రమించుచు తెరపడును)

---

## —♦ తృతీయరంగము ♦—

(మాధవరావుగది-షణ్ముఖుడు-మాధవరావు-నిలచియుండ తెర లేచును.)

మాధ—ఒరే షణ్ముఖం! మాయింటిలో బంటోతునుండి బాబువరకును, చదువు చదువనే పిచ్చపట్టుకుందేమోయి? నిజముగా చూచిన నాకు చదువెందుకని? అన్నవస్త్రములకు లోటనియా?

మరిపొందకు లోపమనియా? దేనినిగురించి కష్టపడి చదువ వలెను? ఈ యాధునికకాలములో డబ్బుప్రధానం, ధనముండిన దాసీబిడ్డడైనా దర్బారుకు జేరగలడు; ఇక నేనో ద్రవ్యవంతుని పుత్రుడను, మరి యీ ఆకంఠశోష కంగారు యెందులకు? ఇంతకును విద్యాధికుడే వివాహమున కర్హుడా యేమి?

షణ్ము—నాన్నెన్న! ఆలా అన్నవాడిని అచ్చుబల్లమీద మొగము బెట్టి గుద్దవలయును. నీకేమితక్కువయుని, శ్రీమంతుడవు, రూపవంతుడవు. నీవు తలంచిన వధూబృందములతరఫున వకాలతులు సాగవా? అదిగాక దేశోద్ధరణకై మహామహులచే స్థాపింపబడిన మితిలేని యనాథాలయములున్నవి! ఆధునిక శాస్త్రీయకాలము చక్కని చుక్క నొకతె నెంచుకొని వివాహమాడిన భార్య దొరకుటయేగాక దేశోద్ధారకుల జాబితాలో నీ వొకడవై యుంటావు. ఏమిపోయినది (రాజారావువచ్చుటచూచి) ఆవచ్చున దెవరో చూడుము, రాజ రావువలెనున్నాడే.

మాధ—ఔను! వాడే! ఇక నీ పుస్తకాలపురుగు వచ్చినదేతడవు, గొప్ప ప్రొఫెసరువలె యెడ్యుకేషన్ (విద్య) మీద లెక్చరు కొడ్తాడు! ఇంతకును వీడు వచ్చే యుద్దేశ్యము నాకు తెలియును గాబట్టి వచ్చిన వెంటనే నాల్గు వెండిచెప్పులు తగిలించితే వాడే పలాయనసూత్రము పఠిస్తాడు.

రాజా—(ప్రవేశించి) హాలో! గుడ్‌మార్నింగ్ బ్రదర్స్.

మాధ—హాలో! గుడ్‌మార్నింగ్! రాజ రావు! ఎక్కడనుండిరాక? ఇన్నాళ్ళనుండియు కానరావడములేదేమిటికథ?

షణ్ము—కథకేమున్నది! కాలక్షేపమంతా కారాగారమువలె కాలేజిలోను, తప్పితే గదిలోను. ఈయనగారు యీవేళో రేపో రవీంద్రనాథునికి రాబోయే పదవులు రాబట్టుకునే రసాభాసలోనున్నారు.

రాజా—నా రసాభాసమాటకేమిగాని, మిత్రులారా! మీకింత విద్యాతిరస్కారము తగదుసుమా.

మాధ—షణ్ముఖా! మరచిపోయాను. నాన్నగారు యింతవేళకు యింటిలో నుండమనినారు (రాజారావునుజూచి) మిత్రమా! రాజారావు! ఇప్పుడు నీతో సావకాశముగా మాటలాడుటకు వ్యవధిలేదు, నీ దారిద్ర్యదేవతయే నిన్నింతవరకును రక్షించినట్లున్నది! ఇదిగో యిప్పటికీ నాలుగు రూపాయలు తీసుకొని వెళ్ళి ఖర్చుబెట్టుకొనుము (యిచ్చును)

రాజా—(పుచ్చుకొని) థాంక్స్!

మాధ—థ్యాంక్స్ (రాజారావొకవైపునుండి—మాధవరావు షణ్ముఖులు - వేరొకవైపునుండి నిష్క్రమించుచుండ తెరదిగును.)

---

## —♦ చతుర్థరంగము ♦—

(తెనుగుటీచరు టేబిలు యెదుట కుర్చీపై గూర్చొనియుండ, నాప్రక్కన బెంచిమీద, షణ్ముఖుడు, మాధవరావును గూర్చొనియుండ తెరలేచును).

టీచ—(కోపముతో టేబిలు గుద్దుచు) నాన్సెన్సు! మీకు జ్ఞానం లేదు! నేనొకటి యడుగుచుండ మీరొకటిచెప్పెదరా? బుద్ధి దగ్గరబెట్టుకొని చదవవలదా? మరల నీ సారియు నట్లే జెప్పిన మిమ్ము బెంచిపై నిలుచబెట్టెదను. జాగ్రత.

మాధ,షణ్ము—చిత్తము.సార్! సెలవిండు చెప్పెదము.

టీచ—మంచిది! ఖడ్గతిక్కన, రణభూమినుండి మరలివచ్చుటకు గల కారణమును నిరూపింపుడు.

మాధ—చిత్తముసార్! కాఫీకి వేళయైనందున.

షణ్ము—కాదుసార్! యిడ్లెన్ను, సాంబారుమీదకు మనసు మరలుటయే దానికిగల ముఖ్యకారణము.

టీచ—ఛీ! మూర్ఖులారా! నోరుమూయుడు. చదువకున్న [illegible]సమాధానమీయుటమాని వేయవలెనుగాని, ఈ యవతవక సమాధానము

లెందు కీయవలయును? చవట వెధవలు! నావద్దనా మీ యాటలు? ఇప్పటికి మూడేండ్లనుండి వరుసగా మీ రిరువురును ఫేలగుచువచ్చినను, మీకు సిగ్గులేదా? సరిసరి! ఇకనేమి! యీ సంవత్సరముతో నాలుగేండ్లుకూడా నిండును లెండు. (బల్లగుద్దుచు) ఊం! లెండు! మీ రిరువురును బెంచిపై నిలువుడు. (ఇరువురును బెంచిపై నిలుతురు. తెరలోనుండి స్కూలుబాలురెల్లరును గొల్లు మని నవ్వుచుందురు. టీచరు కోపముతో చూచుచు నిష్క్రమించును.)

వణ్మ్మ—ఒరే బ్రదర్! మాష్టరు మనలను బెంచిపై నిలిపినాడని, మనక్లాసు వెధవలంతా యెలానవ్వుచున్నారో చూచావ్?

మాధ—ఏడ్చిచచ్చారులే! నవ్వుకోననిమ్ము! నవ్విన వాళ్ళతండ్లే బయల్పడునుగాని, మన కేమిలోటురా? (తెరలో బెల్ గొట్టుచుండ నిరువురును నిష్క్రమించుచుండ తెరపడును.)

---

## —♦ పంచమరంగము ♦—

(తెరలేచిన-శకుంతల-శ్యామల-పుస్తకములతో ప్రవేశము)

శ్యామ—అక్కా! శకుంతలా! ఈవేళ టౌనుహాలులో లెక్చరట.

శకుం—ఔను! సోదరీ! పోవుదము! మదరాసునుండి వచ్చిన, శ్రీమతి లలితాంబగారు స్త్రీ విద్యావిషయమున మహోపన్యాస మిచ్చునట. ఆహా! స్త్రీ లోకమునకిట్లు సేవజేయుచున్న యీ తరుణీశిరోమణి యెంత ధన్యురాలు! స్త్రీ విద్య బొత్తిగా కూడదని తీవ్ర ప్రచారము జేయు సనాతన మత్తేభముల పాలి పంచాస్యమై పని జేయుచు, భారత దేశమంతయును మహోపన్యాసములతో నింపి వేయుచు, స్త్రీ విద్యావశ్యకతనుగూర్చి, తనుమనధనంబుల ధార వోయుచున్న యీనిరాడంబర వ్యక్తి జీవితమే ధన్యజీవితము. ఇట్టి స్త్రీ రత్నములు కొందరు కలిగియుండుట చేతనేగదా!

మనమింత విద్యాభ్యాసమైన జేయగలుగుచుంటిమి. లేకున్న మనలను సనాతనులు చీకటికొట్లలోననే బంధించి లోకజ్ఞానమైన లేని యవివేకులుగా జేయు శాసనములు సృష్టింపకుందురా? మొన్న బెజవాడలో సనాతనులు కొందరు స్త్రీలబలులు వారు విద్య నేర్చినంతమాత్రమున ప్రయోజనమేమని లేఖమూలమున మన లలితాంబగారికి దెలిపిరట. దానికి సమాధాన మాకవయిత్రి నాటి మహోపన్యాసమున నొక పద్యము రచించి యిట్లుచదివెనట.

సీ. పరమ దుర్మార్గుడౌ ♦ పతిని సన్మార్గుని
గావింపగలుగుట ♦ కాంతగాదె
విభుని దుశ్చేష్టల ♦ వెలిబుచ్చగాబోక
కడు నోర్పున భరించు ♦ కాంతగాదె
తనను కీడొనరించ ♦ దప్పుడెంచ నొరులకు
నీతిజెప్పని సాధ్వి ♦ కాంతగాదె
పతికి నెద్దియు దోచ ♦ బడకున్న యోచన
గావించి చెప్పుట ♦ కాంతగాదె

గీ. కాంత సృష్ట్యాదియని యెంచ ♦ గలుగరయ్య
అట్టి కాంతలు సబలు లె ♦ ట్లౌదురయ్య
కాంత లేకున్న ప్రకృతి ♦ గడచునయ్య
సరస విద్యార్థికులు మీర ♦ లెరుగలేరె
ధరిజనులార యో భార ♦ తీయులార.

శ్యామ — అక్కా! తగినట్లు సమాధానము చెప్పినది మేలు మేలు! రమ్మా పోవుదము వేళయైనది.

(నిష్క్రమింప తెరదిగును.)





# బీదవిద్యార్థి బి. ఏ.,

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

(రామారావుయిల్లు. రామారావు-శ్యామల నిలచియుండ తెరలేచును)

శ్యామ—తండ్రీ! నన్నుబిలచిన కారణమేమి?

రామా—అమ్మా! నాహోటలుసరిగాసాగుటలేదు. ఐనను, యేసందులో జూచినను, యేడెనిమిది కాఫీహోటళ్ళకు తక్కువలేక వెలసియున్న, ఈదౌర్భాగ్యపుదినములలో నావంటి బక్కవానిహోటలు దక్కనేర్చునా? ఇంతవరకెట్లో కష్టపడి నిన్ను చదివింపగలిగితిని గాని, యికముందుమాత్రము—

శ్యామ—తండ్రీ! నీవు చదివింపజాలనని చింతింపకుము. చివరకు బిచ్చమెత్తియైన నేను చదువుకొనెదనుగాని, మానజాలను.

రామా—తల్లీ! అంతటి యగత్యములేకయే నీవు చదువుకొనుటకొక చక్కనిమార్గము గలదు.

శ్యామ—జనకా! ఆమార్గమేదియో యించుక వివరింపుము.

రామా—మనయూరగల లక్షాధికారి వెంకటరావుగారి పుత్రుడగు మాధవరావు నెరుగుదువుగదా?

శ్యామ—ఆ ఆ! నేనెఱుగ కేమి? ఫోర్తుఫారములో ముమ్మారు వెనుకకు పల్టీలుగొట్టిన యా ప్రజ్ఞాధురంధరుని—

రామా—ఔను! అదియెగదా! అతనిదగ్గరనున్న చిన్నలోటు!

శ్యామ—అంతమాత్రమున కేనా? అతనికి పిల్లనెవ్వరీయకుండిరి.

రామా—ఔను! అంతియేగాని, అమ్మా నేను నీకడ దాచనేల? నీకు పెద్దసంబంధములు తెచ్చి నేను పెండ్లిసేయజాలను! ఆ విషయము నీవెఱింగియుండినదే గావున, నీవా మాధవరావును వివాహమాడుదువేని నీ విద్యాభివృద్ధికేమియును లోటులేదు సరిగదా! నీమూలమున మా కష్టములుకూడ గడచిపోవును. తల్లీ! ఈ నా కోరికను నెరవేర్పుము.

శ్యామ—(ఆశ్చర్యముతో) ఆ, ఆ, తండ్రీ! ఏమంటివి? నిజముగా నీ జిహ్వాగ్రమునుండి వెలువడినవాక్యములేనా యివి?

రామా—ఔను! కుమారీ! నిస్సంశయముగా.

శ్యామ—ఆహా! తండ్రీ! నీవింతటి యత్యాచారమును జేయ సంకల్పించితివా? ఓహో! ఏమి నీ సాహసము! కత్తిలేకయే కన్న కూతుగొంతుగోయ సంకల్పించితివా? ఏమేమీ? ఆ విద్యావిహీనుని! ఆ నరపశువును! ఆ దుర్మార్గప్రవర్తనుని! నేను పెండ్లియాడవలయుననియా నీ కోరిక? ఆ పరదారాగమనుని వివాహమాడి జీవితపర్యంతమును దుఃఖభాగినినగుటకన్న, బ్రహ్మచారిణినై యుండెదను. ఆ సుగుణవిహీనునకు సూత్రమును గట్టుమని గళమర్పించుటకన్న నీ కోమలగాత్రమును నురిపాశమునకు గురిజేసెదను. ఆ క్రూరాత్మునకీ కుసుమసమ దేహమర్పించి రోగపీడితనగుటకన్న నగ్నిహోత్రునకాహుతి నొసగి పవిత్రనయ్యెదను.

విలాసరావు—(ప్రవేశించి) చెల్లెలా! అట్టి తండ్రికి తగినట్లుగా సమాధానమిచ్చితివి! బాగుబాగు! సంతసించితిని.

రామా—(విస్మయముతో) ఆ, ఆ కుమారా! అదియేమి? నీవు కూడా దానికే తోడైతివా? సరిసరి! ఇక నేమి.

విలా — ఔను ! తండ్రీ ! మే మిరువుర మేకగర్భజనితులముగామా ?

రామా — (తలనోకికొనుచు) కుమారా ! మీవంటి విద్యాధికులు తల్లిదండ్రుల కెదురాడవచ్చునా ?

విలా — ఔను! ధర్మముపట్ల నెదురాడినను తప్పులేదు ! అదిగాక, మీవంటిధనాశాపరులగు తల్లిదండ్రులకు, మావంటి యాదర్శకులును,సంస్కారప్రియులగు,పుత్రపుత్రిక లీయవలసిన సమాధాన మిదియే ! తండ్రీ ! ఏమి నీయవివేకము !

గీ॥ అమల విద్యావిశారద ♦ యైనయట్టి
చంద్రముఖియేడచదువురు ♦ సంధ్యలేని
జారుడగునట్టివరు డేడ ♦ చాలుచాలు
కలుగునేవీరికింక ని ♦ క్క ంపుమైత్రి
సరస దాంపత్యమానె యీ ♦ జాడజూడ.

వేయేల ? తండ్రీ !

మ॥ అరయన్జిల్కకు నూరకిచ్చుకకు నెం♦య్యంబొప్ప దాంపత్యమున్
సరణిన్గూర్చిన గూర్చుగాక నొరులా ♦ చందంబపాయంబునై
బరగున్గాక సుఖాన్వితంబునగుచున్ ♦ పెట్టిల్లు దబ్బెన్ననీ
విరసంబైన వివాహమెంతయు సదా ♦ వేధించు నాసోదరిన్
జరుగన్నీయను ఘోరకంటకపు యీ ♦ సంరంభ మేనాటికిన్.

(శ్యామలనుజూచి) శ్యామలా ! భయమంచకుము.

ఉ॥ మాటల కేలనీచదువు ♦ మానుపజాలను తల్లిదండ్రులీ
నూటికి బోయియుంచు మది ♦ నుంతగలంగకు రమ్మపోదమిం
కేటికి యింటియాశలిక ♦ నెక్కడి తల్లియుదండ్రిజేలరో
కూటికి లేకయున్న నెట ♦ కో జని బిచ్చము నెత్తియైన నే
లోటునురాక నాకడుపు ♦ లో నిడి పెంచెద ముద్దుచెల్లెలా.

రామా — అయ్యో ! కుమారా ! చివరకు నీవింత సాహసముజేయ సంకల్పించుకొంటివా ?

విలా — ఔను ! మోసముమీది, సాహసమునాది. తండ్రీ !

గీ. పుత్త్రినమ్మిన పైకంబు • బోగుజేసి
పడుపురుచు నవ్వ సుఖముగా • బ్రతుకకంటె
యెంచ దారిద్ర్యమున బిచ్చ • మెత్తియైన
నాకులలములు దిని • జీవయాత్ర గడప
జాలలేవా సుజనులు • మేలనంగ.

(శ్యామల చేయిబట్టుకొని) సోదరీ! స్వార్థపరులగు నిట్టి తల్లిదండ్రుల
కడ నుండుటకన్న యేయన్నసత్రముననైన నుండుట మంచిది రమ్ము
పోవుదము (ఇరువురును నిష్క్రమింతురు)

రామా — ఆహా! గొప్పచిక్కు వచ్చెనదే? (యోచించి) అన్నా! ఎంత
ప్రమాదము! మాధవరావునకు శ్యామలను వివాహము జేసెదనని,
ఆతనితండ్రియగు వెంకటరావుగారివద్ద నైదువందల పైకమును
దీసికొంటినిగదా! మరి యిపుడాతనికి పిల్ల నీయకున్నయెడల పైక
మైన నీయవలయునుగదా! పైకము నాకడ వ్యయమైనది! యిపు
డేదిదారి! నాకేమిగతి! అయ్యో! శ్రీమంతుడగు నాతనికి నేనే
మని సమాధానము చెప్పవలయును (కొంచెమాగి) ఓ! తెలిసినది!
తెలిసినది! ఇపుడెట్లయిన నన్నాపుత్త్రిని, పుత్త్రికను, మంచిమాటలు
జెప్పి యింటికి తీసుకొనివచ్చి, వారియిష్టానుసారము ప్రవర్తించు
వాడనువలె నటించి, నాకుమాను నద్దైన మిషపై గ్రామాంత
రమునకు బంపి, బలవంతముపై శ్యామలను మాధవరావున కంట
గట్టెదగాక! ఆకొంచెముపనియు జరిగినతరవాత నదియే వచ్చినట్లు
పడియుండును! అన్ని విధములను నామానము దక్కుట కిదియే
మంచిమార్గము, వీరలీసరికెంతయో దూరముపోయి యుండరు.
త్వరితముగా నేగి వారినికలసికొని, యింటికి తోడ్కొనివచ్చెదనుగాక!
(నిష్క్రమించుచుండ తెరదిగును.)

---

## — ద్వితీయరంగము —

(రాజబాట — తెరలేచిన శంకరరావు నీళ్ళకావిడితో ప్రవేశించి,
విచారవదనముతో)

ఆహా! విధివిలాస మెట్లుగామారుచుండును?

శా॥ తేజంబున్ పటుదర్పమున్ చనగ మేల్ ♦ దీనత్వమే పారగా
రాజున్ సేవకుగా నొనర్చు తన దా ♦ రాజ్యంబునన్ సేవకున్
రాజున్ జేసి తదీయ సేవకునిగా ♦ రాజున్ని యోగించున
వ్యాజప్రేమను దోసిపుచ్చు విధి కృత్యంబుల్ దురంతరంబులా.

విధాతవిలాసమే గాకున్న చో! ఆహా! నా స్థితి యెక్కడ? నే నెక్కడ? ఆగర్భశ్రీమంతుడనైన నేను నా సర్వస్వమును గోల్పోయి, గర్భదరిద్రుడనై, భార్యను మృత్యువాత బడవైచి, కన్నకొడుకునకు కట్టబట్టయు, పొట్టకు కూడును బెట్టజాలక వారముల భుజింపజేయుచు, నేనిట్లు నీళ్ళకావడులమోయుచు, వంట పుట్టినై, పరదాస్యమునకు పాల్పడవలసిన గతిబట్టునా? ఔరా! ఇట్లు జీవితమును గడపుటయనిన నెంతకష్టతరము. !

చ॥ ఒకనికి బెట్టి, యొక్కనిచె ♦ నూడిగముల్ గొనువాడు తాను వే
రొకనికి సేవకుండగుచు ♦ నూడిగముల్ నొనరింపకష్టమా
నకట! ధరిత్రిమృత్యువిక ♦ నారయ నింతకు మేలు కష్ట జీ
వికి నొకరోజుయేడగుచు ♦ వేదనబెట్టక యుండ నేర్పునే.

అడిగాక ప్రథమమునుండియును,

గీ కష్టపడువాడు సుఖపడగలుగుటనిన
సులభమగుపని యగుగాని ♦ తొలుత సౌఖ్య
పడిన మనుజుండు తుదికష్ట ♦ పడుటయనిన
ప్రకృతి విరుద్ధమగునట్టి ♦ పనియెగాదె.

రాజారాన్న—(ప్రవేశించి) అమాత్య! తండ్రీ! నేను వారముల భుజించువారలలో నలువురు కుటుంబీకులు, ఈ దినముననే, కాశీయాత్రకు వెళ్ళియుండిరి. ఇంక నాకు గతియేమి?

శంక—ఆహా! ఆయాశయుగూడ నడుగంటినదా! ఔను.

గీ. గాయమునుగల్గు కాలిపై ♦ కత్తుబూను
సరణి నచ్చోట శ్వానంబు ♦ గఱచినటుల

ఘనతరాపదలను జిక్కి ♦ మనుజునకును
కష్టములెవచ్చి పైబడు ♦ గాదె తనయ.

అయ్యో! పుత్రికా! దీనులమగు మనకింక దిక్కేది.

రాజా—నామిత్రుడైన మాధవరావు జనకుడు, వెంకటరావుగారి యూరనొక యన్నసత్రమును గట్టించినారు. వారి నాశ్రయించిన నాలుగురోజులును నాకింత యన్నముపెట్టెదరేమో! తండ్రీ! పోయి వారిని దర్శించెదమా?

శంక—మంచిది! కుమారా! ఆ ప్రియత్నమునుగూడ గావించెదము రమ్ము. భగవానుడు, దరిద్రులమగు మనపాలిట దయజూపలేడా? (యిరువురును చేతులు జోడించి)

పాట—శ్రీరాగం—చతురశ్ర.

ప॥ దీనుల మము బ్రోవగరావే రంగ।
దీనజనోద్ధారీ మురవైరీ ॥దీ॥

అ॥ ఆర్తజనావన యదుకులాభరణ।
అఖిలజగన్నాటక సూత్రధారి।
ఆర్తిబాపి సంరక్షణజేయుము।
అజరుద్రాద్యఖిల భవాండరూపకా ॥దీ॥

చ॥ కనుతెరచితివా నీరూపములై।
గానబడను లోకములూ।
కనుమూసినచో కల్పక్షయమై।
కానరావు లోకములు హరిహరి ॥దీ॥

(పాడుచు నిష్క్రమించ తెరదిగును.)

---

## —♦ తృతీయరంగము ♦—

(తెరలేచిన-రూములో, మాధవరావు, షణ్ముఖుడు పేకాడుచు కుర్చీలపై గూర్చుందురు. మధ్యను జానుబల్లపై పేకముక్కలను వేయుచు - యిరుప్రురును)

డైలాగుపాట—మోహన—ఆది.

మాధ — ప॥ పేకాటకు సమమైనదిలోకము ననుగానరాదు
పేకయె సంతోషకరము నాహా ! ఆహా...॥పే॥

షణ్ము — అ॥ పేకయె మానవులపాలి | పెన్నిధి యానందమయము
పేకమహిమనెఱుగనట్టి । పీనుగులదౌక నరజన్మమె ।పే॥

మాధ — చ॥ పూని చదువుశాస్త్రంబులు । దీనిమీద ఒలాదూరు
దీని మర్మ దెలిసికొనిన । దేనికింక స్వర్గపథము ॥పే॥

షణ్ము — దేవుడెవడో గీవుడెవడో । తెలియరాదు కానబడను
దేవునివలె కనబడి యిది। తిరుగును మనచేతనెపుడు ॥పే॥

మాధ — ఔను ! షణ్ముఖా ! అయ్యది సత్యము ! దీనిమజా వొక్క సారి తెలిసిపోయినదంటే దేవతలైతేమాత్రము దీన్ని విడిచిపెడతా రటోయ్ !

షణ్ము — ఛస్ ! వెధవ దేవతల్లెక్కేంటి ! దేవేంద్రుడైననుసరే, ఈ చతుర్ముఖపురాణమొకసారి చేతబట్టెనా ! స్వర్గమున నిక దేవ కన్యల ధ్యానమును మానిపించి ఈ విచిత్రకన్యలనే తన యాస్థాన నాట్యగత్తెలగా నియమింపకుండునా ? అదియునుగాక,

గీ. అమల సౌందర్యవతులైన ♦ యట్టి రంభ
ఊర్వశీ మేనకాదుల ♦ హోతమంత
బాళిమైవచ్చి తనపైన ♦ బడినగాని
నంటునేయింక నీపేక ♦ నంటుచేత.

మాధ — ఔను! దీనిమహిమమట్టిదియేయగును. మిత్రమా! షణ్ముఖా! యెన్నిచదువులు చదివిననేమి కాల్చనా! మానవుడై పుట్టినందులకు చదవిన చతుర్ముఖపురాణమే చదువవలయును.

చ. తెలియని మూర్ఖమానవులు ♦ దట్టినమాత్రమె పేకరాజుకే
కలితి లభింపగల్గు పది ♦ నే విధంబుల నెంచిచూడ నీ
కలియుగ కల్పవృక్షమొయి ♦ కష్టము చింతలబాపి సౌఖ్యమిా
గలిగెడు యట్టి దేవనిన ♦ కర్గ్రనపేకనె జెప్పగావలెన్.

సీ. ధరణీపతుల జమీం ♦ దారుల మృదువైన
కరపద్మముల నిల్వ ♦ గలుగునేది
ఉద్యోగిగణముల ♦ యున్నతటేబిల్సు
లందునతాండవం ♦ బాడునేది
ధనికులౌ వారికి ♦ దారిద్ర్యపరులకు
నానందమునుగూర్చి ♦ యలరునేది
యెట్టి కష్టులుచేత ♦ ఒట్టియాడినయంత
వేలుచింతలబార ♦ దోలునేది
గీ. తరుణులకు గూడనాడగా ♦ దగినదేది
విద్యలన్నింటి లెదన్ని ♦ వెలసెనేది
భూమిపై మేటి ప్రఖ్యాతి ♦ బొందెనేది
అట్టి పేకాట మాని వంగ ♦ నగునె మిత్ర!

షణ్ము — మిత్రమా! మాధవా! చక్కగా జెప్పితివి. ధనముగలిగి నందుకు యెల్లప్పుడును, కాలేజీలోననే కాలక్షేపము జేయుచు, నూతిలోని కప్పవలె, చదువుచు పడియుండిన సార్థకము లేదు. పేకాడవలె, నిరంతరము కారులలో షైరులుగొట్టవలె, సినిమాలు జూడవలె, నాటకము లాడించవలె, శృంగారవతులతో గూడి మనవలె-సయ్యాటములాడవలె, అప్పుడుగదా జన్మమెత్తినందులకు సార్థకము.

మాధ — (కికికికి నగుచు షణ్ముఖుని వీపు దట్టుచు) ఫేష్ ఫేష్ ఫేష్ ఏమినీ వర్ణన! కవి నీవలె నిట్లు వర్ణింపగలడు? నిజముగా జూచిన

కవికలమున కన్న నీ నాలుకయే చురుకైనదిసుమా! సినిమాకు వేళయైనది రమ్ము పోవుదము. నేడొక బ్యూటీఫుల్ గరల్ మన కచ్చట తటస్థింపగలదు (ఇరువురు చేతులుబట్టుకొని నిష్క్రమింప తెరదిగును.)

---

## — చతుర్థరంగము —

(రంగనాయకియిల్లు. మాధవరావు, షణ్ముఖుడు కుర్చీలపైగూర్చుండి యుండ తెరలేచిన, రంగనాయకి డ్యాన్సుచేయుచు ప్రవేశించును).

పాట-కల్యాణి—చతురశ్రి

ప॥ మోహనరూపప్రియా ! మోమైనజూపదయా॥ మో॥
అ॥ మోహనరూపప్రియా ! మోహముతీర్పమునద నా॥ మో॥
చ॥ నిన్ను నెరనమ్మితిరా । నీవెదికకంటినిరా
నన్నుతాంగసిన్నవీడ । జాలను రాజాగేలా॥ మో॥
చ॥ కెమ్మోవియధరామృతము । గ్రోలికౌగిలీయరారా
మారసుందరాకారా । మనసుదీర సూడరారా॥ మో॥

(మాధవరావు-షణ్ముఖుల బుగ్గలపైబొడుచును).

మాధ, షణ్ము—(చప్పట్లుచరచుచు) భేష్‌భేష్ ! భేష్‌భేష్ !

డాఫరుజాకీ—(ప్రవేశించి) సరిసరి ! ఏమండోయ్ ! మంచిబాగుందే ! మీ సరసాల్లోబడి నా మామూల్లివ్వడం మరచేపోయారు ? ఏదీ నా ముద్దు ముందు ముట్టజెప్పండి.

మాధ—ఓహో ? ఢాఫరుజాకీగారు దయచేశారూ !

షణ్ము—ఓరీ దాక మొగమా! నీ మామూలెక్కడికిపోవునురా! వడ్డీకి వడ్డీగట్టి, చెవులు నలిపి కాంపౌండు వడ్డీతోసహా వసూలుజేసే ఆతిరుపతి వెంకటేశ్వరుని ముడుపైన నొకవేళ తప్పించుకుంటే తప్పవచ్చునుగాని, నీ ముడుపుమాత్రము తప్పదు, యిదిగో ముద్దు పంచకము (యిచ్చును.)

డాఫ—(పుచ్చుకొని కనులకద్దుకొని) బలే! బలే! ఈరోజుల్లో డాఫరు కున్న ధనార్జనసౌఖ్యం-మరెవ్వరికిని లేదు. (చప్పట్లుచరచుచు)

పాట - మిశ్ర-బేహాగ్-చతురశ్ర)

ప॥ రామునిమించిన రక్షకుడూ యీ। రాజ్యంబునగలడా శ్రీ॥ రా॥
అ॥ డాఫరువృత్తికి మించినవృత్తి । ధరలోపలగలదా శ్రీ॥ రా॥
చ॥ ధరలోనను నుపకారెవరంటే । డాఫరెవుపకారి ।
సరసులకును విటకత్తెలకూర్చెడి । సంతతపుణ్యుండు శ్రీ॥ రా॥

(పాడుచు గంతులువేయుచు నిష్క్రమించును.)

మాధ-మణ్మ—(చప్పట్లుచరచుచు పకపకనవ్వుచు) హిఫ్ హిఫ్ రే! థాపర్ జాకీ! హిఫ్ హిఫ్ రే! థాపరుజాకీ.

రంగనాయకి—(మణ్మఖుని, మాధవరావును చెరియొక చేయిబట్టుకొని వయ్యారముగా లోనికి గొనపోవుచుండ తెరదిగును.)

---

## —♦ పంచమరంగము ♦—

(వెంకటరావుభవనము-వెంకటరావు విషాదముతో గూర్చుండియుండ తెర లేచును.)

పాట—కాఫీ-ఆది.

ప॥ ధనముగలిగి ఫలమేమి తలపగ
ధనముగలిగి ఫలమేమిజగతిని॥ ధ॥
అ॥ తనయుని గుణవం। తునిగనజాలని
జననీజనకులజన్మ । లు వృధ మా॥ ధ॥
చ॥ కులవర్ధనుడగు । కొడుకు యీగతిని
తులువయగుచు మము । దుఃఖపెట్టగా॥ ధ॥

అయ్యో! ఎంత భాగ్యవంతులమైననేమి? ఏకపుత్రుని దుర్మార్గ కార్యముల దలంచుకొనుచు, ననవరతమును మా దంపతులు విషాదపారావారవీచికల దేలియాడుటకన్న, మే మనుభవించు

సౌఖ్యమేమిగలదు! ఆహా! ఇంక మా పుత్రుడు సన్మార్గ వర్తనుడై కులముద్ధరించుననుట కలలోనివార్త. కానిమ్ము త్వరలో వివాహమును గావించిన నేమైన బుద్ధివచ్చునేమో యనుకొన్న, వీని యావలక్షణము లెరింగియున్నవా రెవ్వరును పసుపునీయ భయపడుచుండిరి. కాఫిహోటలు రామారావు తన కుమార్తె శ్యామల నిచ్చెదనని నాకడ నైదువందలు గొనిపోయెనుగాని ఆ యాశయు గూడ నడుగంటినది. ఆ పిల్ల నావాని బెండ్లియాడజాలనని తల్లిదండ్రులతో ఖండితముగా జెప్పివేసినదట. ఔను! దానిలో తప్పేమిగలదు? ఆ పిల్ల యట్లు సమాధానము జెప్పినదనిన నాకు నాశ్చర్యము లేదు. విద్యావతియగు కన్యక, చూచుచు, చూచుచు నొక మూర్ఖాగ్రేసరుని మెడకట్టుకొనునా యేమి? ఆహా! చేయవలసిన ప్రయత్నములన్నియును జేసితిని, కాని, అవియన్నియు నిష్ప్రయోజనములైనవి. ఇంక నే నిపు డేమిచేయగలను? వీని కీప్రాంతముల వారెవ్వరును పిల్లనీయ సాహసింపరు. ఏదైన దూరదేశమునకుబోయిన తెలియనివా రెవ్వరైన నిచ్చెదరేమో ప్రయత్నింపవలయును. అయ్యో! చివరకు నా కెంతగతి పట్టినది.

గీ. కడుదురాత్ముని కొడుకుగా ♦ గనుటచేత
ధరణి మాకిట్టి యపకీర్తి ♦ దాపురించె
తనయునీకుండినను మంచి ♦ దగునుగాని,
హేహరీ! నాదు పగవాని ♦ కేనియిట్టి
కూరసంతతి దయసేయ ♦ కుండుమయ్యా.

(శంకరరావు. రాజారావులు ప్రవేశింతురు).

శంక—అయ్యా! వెంకటరావుగారు! వందనములు.

వెంక—(చూచి) ఓహో! శంకరరావుగారా! వందనములు! పాపము! మీ ప్రస్తుతపరిస్థితి మిక్కిలి విచారణీయము. తమరాక కిపుడు కారణమేమియో సెలవిండు.

శంక—అయ్యా! ఉదార హృదయులగు మీవంటి నేనొక గొప్ప సహాయమును బడయవచ్చితిని. మీ దయయున్న—

వెంక—స్తోత్రము వలదు చెప్పుము! నాచేతనైన దేదియైనను తప్పక చేయగలను. సందేహింపకుడు.

శంక—చిత్తము! నావిషయము మీకు కొంతవరకు తెలియును. నా కుమారుడు వారములు భుజింపుచు చదువుకొనుచున్నవాడు. ఆ వారములవారిలో నలుగురు కుటుంబీకులు కాశీయాత్రకు వెళ్ళిరి. దయచేసి మీరా నాలుగురోజులును—

వెంక—శంకరరావుగారు! నాలుగురోజులు కర్మమేమి! ఎల్లకాలమును మీ పుత్రిని, మా సత్రమునసే భుజింపమనుము. ఎట్లయిన నపుడు నాకడకువచ్చిన ధనసాయముగూడ జేసెదను.

శంక—చిత్తము! మీ పరిపూర్ణానుగ్రహమునకు కృతజ్ఞులము.

వెంక—రాజారావు! నీవెంకయ్యను బుద్ధిమంతుడవు, నీమిత్రుడగు మా మాధవరావును మంచిమార్గమున బ్రవేశపెట్ట యత్నింపుము.

రాజా—చిత్తము, సెలవు. (నిష్క్రమించుచుండ తెరదిగును.)



# బీదవిద్యార్థి, బి. ఏ.,

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

(తెర లేచిన-రంగనాయకి శయ్యాగృహమున సోఫాపై రంగనాయకీ షణ్ముఖులొకరిభుజముపై నొకరుచేతులువేసుకొని కూర్చుని-డైలాగు)

ఖండజాతి—జంఝూటి.

షణ్ము—ప॥ కనకాభిషేకమును । గావింతునేసిప్పుడె ॥క॥
అ॥ వనిత సీవైభవము । గని వేశ్యతతిబొగడ ॥క॥
చ॥ సమరతుల ననుగూడు । సఖియమేల్ నెరజాణ
కమలాక్షి, నాప్రాణ । సమమైన నీకు నే ॥క॥

రంగ—(షణ్ముఖుని పయ్యారముగా కౌగిలించుకొని) ఆహా ! ఏమి !
ప॥ నా భాగ్యమిది ప్రాణ । నాయకా పరికింప ॥నా॥
అ॥ ఈభాగ్యమే వేశ్య । కేని లభియించునా ॥నా॥
చ॥ నాపాలి కల్పకమ । నాపెన్నిధానమా
ఓ పరమపావనా । ఓ భువనమోహనా ॥నా॥

(షణ్ముఖుని చెక్కిలి నవరించి ముద్దిడుకొని) సుందరా ! కనకాభిషేకమునకెన్నికాసులను దెచ్చితివి ?

షణ్ము—(రంగనాయకిశిరము నిమురుచు) మోహినీ ! రంగనాయకీ ! ఇవిగో ! ఏబదికాసులు.

రంగ—(చిరునవ్వున) సంతోషము, ధాపరుజాకీ—

ధాపరుజాకీ—ఆ! ఇదేవచ్చితివి (ప్రవేశించి) ఏమి యాజ్ఞ- ఓహో! జమిందారు షణ్ముఖుఁగారుదయచేశారా! జయీభవ- విజయీభవ_ సమస్తవేశ్యాజనకల్పక. తాప్పుజనమందార విటజనాగ్రేసరసార్వభౌమా- వైభవ-దిగ్విజైభవ.

షణ్ము—ధాపరుజాకీ-త్రిజగన్మోహిని-సకలవేశ్యాశిరోమణీ-దేవతా వర ప్రసాదిని-సరసశృంగార వచనరచనాకల్పిత కాంతాలోకపాలిత నవమన్మధుషణ్ముఖహృదయతాపహారిణీయగు, మీరంగనాయకమ్మగారికి, కనకాభిషేకము జేసెదను, వెండిచెంబుతో నుదకమును గొనితెమ్ము.

డాఘ—(ఒకతుమ్ముతుమ్మి) ఓహో! అటులనా! అదీకథ. చిత్రము చిత్రము- మహాభాగ్యము- ప్రభువులు- తాము నిరంతర వేశ్యాజనదానకర్ణులు- రంగనాయకీమనోనివాసకులు (లోనికిబోయి వెండిచెంబుతో నుదకము నుదెచ్చి షణ్ముఖునకిచ్చును)

షణ్ము—కుడిచేత కాసులు బట్టుకొని- రెండవచేత పాత్రను ధరించి కాసులపై కొలదిగా నీరము చిలకరించుచు రంగనాయకి శిరమున బడునట్టభిషేకము జేయుచుండును.

ఇరువురును డైలాగుపాట—భీంఫలాస్—ఆది.

షణ్ము - స॥ సంతోషంబగు సమయంబిదిసతి ॥సం॥
సంతత ప్రణయసాఫల్యంతులకు మనకు ॥సం॥
అ॥ ఇంతిరో నీ యధరామృత పానము ।
కాంతయు గోరితెడి । యేధన్యుడ ప్రియ ॥సం॥

రంగ— కాంతామన్మధ కరుణాసాగర ।
కామితముల నీడేర్చితివౌరా ।
సంతోషించితి నామది ప్రియుడా ।
జన్మ తరించెనునేడు నాదుసఖ ॥షణ్ము॥ ॥సం॥

షణ్ము—ప్రేయసీ! ఇవిగో! ఏబదికాసులు (యిచ్చును)

రంగ—(పుచ్చుకొని కనులకద్దుకొని) నాథా! ధన్యురాలను.

షణ్ము—కలికీ! తన వలపులాడికీరీతి నావలె కనకాభిషేకమును జేసిన వారు ధరావలయమున గలరా?

రంగ—లేరులేరు - మనోహరా! మీరుదప్ప నెవ్వరునులేరు.

డాఫ—ఔనౌను - వెనుక పుట్టియునులేడు - యికముందు పుట్టనూబోడు - ఇదిసత్యము - ముమ్మాటికిని సత్యము - ఈవిషయమున నేను దేవునిమెత్తిన దీపముబెట్టి జెప్పగలను-ఇదిసరిగాని, అయ్యా! మరి నామాట నేమిజెప్పితిరి.

షణ్ము—(జేబులోనుండి రూపాయిదీసియిచ్చి) నీవిక వెళ్లుము.

డాఫ—(పుచ్చుకొని కనులకద్దుకొని) చిత్రము! చిత్రము - రసికాగ్రేసరచక్రవర్తి - లావణ్యమూర్తి - సంతత కాంతాజనమానసవర్తి ఈ డాఫరుజాకీ ఆర్తి - మీవల్లనౌ నివర్తి - జై భవా - దిగ్విజై భవా - (నిష్క్రమించును.)

రంగ—(తక్కుచు నాట్యరముగా షణ్ముఖునిమీద(వాలి) హృదయచోరా! కనకాభిషేకమును జేసిన, ఈ కాసులతోడ, మీప్రేమచిహ్నముగా చంద్రహారమును జేయించుకొనెదనుగాని—

షణ్ము—ప్రేయసీ! అదియేమి? కానియని యూరకుంటివి? ప్రాణమునకు ప్రియునకు వాకడ నీవు దాచవలసినదేమిగలదు-సుందరీ-సందేహింపక మనసిచ్చి చెప్పుము.

రంగ—ప్రాణప్రియా! రవ్వలయొడ్డాణము లేనిలోటు.

షణ్ము—(లేచి నిలువబడి) ఏమేమీ? అదియా నీ సందేహము-ఊన్-అది యెంతభాగ్యము-ప్రియురాలా! రేపీసరికి రవ్వలయొడ్డాణమును గొనితేకున్న సిక నీవెన్నటికిని నా మొగము జూడకుము-నీకొరకై నేనిపుడేబోయి యా ప్రయత్నమును జేసెదను.

రంగ—హృదయేశ్వరా! మీదయగలుగగనా కేమితక్కువ?

షణ్ము— వెళ్లివచ్చెదను (పోబోయితిరిగివచ్చి) సుందరీ! మరచితిని, నామిత్రుడు మాధవరావు మరలనెప్పుడైనావచ్చెనా?

రంగ—(ఎడమచేయి షణ్ముఖునిభుజమునవేసి కుడిచేయి నాతనినడుమునకు నమర్చిప్రేమపురస్సరముగా) నాథా! మీకాసందేహమావంతయునువలదు-మీహృదయనివాసినియగు నీరంగానాయకి, మీరు కల్పించిన నీకుసుమకోమల శరీరమును వేరొకనికిసమర్పించి నీచురాలుగా గోరదనిమీరు గట్టిగానమ్ముడు ఇన్నియేల! మీయాజ్ఞ లేనిదే నాయింటిపైన చివరకు మగకాకిసైతము వ్రాలజాలదు-మీతోడు-మిమ్ములను చంపుకొనినట్లు-నాకన్యచింత లేదు-నాప్రాణసములగు మీశిరముపై చేయిబెట్టి ప్రమాణమును జేయుచుంటిని (అట్లుజేసి) మీరునాకేమిలోటుజేసితిరని నేను కక్కుర్తిపడవలయును-హృదయాధిపతీ! మీరేనాప్రాణము-మీతోడిదేనాకు లోకము-మీరేనాదైవము-మీరే నాసర్వస్వమని మిమ్మేనేనునమ్మియుంటిని.

షణ్ము— సుందరీ! నీ శీలమును నే నెరుంగుదును - రేపురాత్రికి రవ్వల యొడ్డాణముతో ప్రవేశించెదను-సెలవా?

రంగ— త్వరితగతి రావలయునుడీ! లేకున్న మీవియోగమును నేను సైపజాలను (కౌగలించుకొనును.)

షణ్ము—(ముద్దిడుకొని) గుడ్ మార్నింగ్ (నిష్క్రమించును.)

రంగ— ఈ దినములలో పదివేలుఖర్చుబెట్టి పెండ్లిజేసుకొనిన భార్యను అందులో ధర్మశాస్త్రానుసారముగా నర్ధాంగ మనబడు కులకాంతనే, యొకానొకవేళ నమ్ముటకు వీలులేదుగదా! అట్టిపట్ల జీవనమే పావనముగా బెట్టుకొనిన వెలకాంతలము మమ్మేల నీ దౌర్భాగ్యులు నమ్మి నాశనము గావలయును.

(డాక్టరుజాకి అవధానిగారితో ప్రవేశించును.)

డాక్ట— రంగనాయకీ! వీరీయూర గొప్పపండితులు-అపర శుకావతారము. కేవలము-పురుషావతారమునుధరించిన శారదయేయని

చెప్పుటకు సందేహములేదు, ఇట్టి విద్యాధురంధరుని, ఇట్టి రసికాగ్రేసరుని, ఇట్టిద్వితీయ కాళిదాసు నెట్లుగౌరవింతువో, ఏమో తెలియదు. మరియొకమాట రంగనాయకీ! ఏకాక్షియని లోకువగా జూడవలదుసుమా! సకలవ్యాకరణ చక్రవర్తి, ఈ మూర్తి.

రంగ—ఓహో! అట్లనా! అవధానులుగారు! నమస్కారములు. దయచేయుడు, సందేహించెద రేల? రండు.

అవ—సర్వాలంకార వస్త్రభూషణసమన్విత నూతనవిటజనప్రాప్తిరస్తు. శుభమస్తు.

డాఫ—అయ్యా! అవధానులుగారు! నా మామూలు ముందు నా కిచ్చి బంపుడు. మీ కేదితప్పును!

అవ—ఔనౌను! నీ వనినమాట సత్యము; ఏదీ తప్పదు. ఏకవేళ నేది తప్పినను నీది తప్పదు. ఫలాయిశురాసుము జెల్లనిదే కలక్టరుగారి దర్శనము గానట్లు, పూజారికి ముడుపు ముట్టనిదే దేవుని దర్శనము గానట్లు, తారుపుగానిదయను సంపాదించుకొనకున్న, సరసుల కోరికలు సానుకూలబడునా! ఇదిగో శ్రీముఖము (రూపాయి యిచ్చును).

డాఫ—(పుచ్చుకొని కనులకద్దుకొని) జై భవా - దిగ్విజై భవా - పండితాగ్రేసర చక్రవర్తీ - పావనమూర్తీ - సంతత వేశ్యాగృహ ప్రవర్తీ - జై భవా, దిగ్విజై భవ (నిష్క్రమించును)

అవ—రంగనాయకీ! ఈ ప్రపంచములో కెల్లను రెండే ప్రియతరమైన వస్తువులు - అవి యేవనిన

పాట - యమన్ - చతురశ్ర



ప॥ కాంతాకనకం। కలియుగమూలం
ద్వైతాద్వైత విశిష్టాద్వైతం ॥కాం॥
అ॥ యోగులైన వి। రాగులైనను।
బాగుగసతులకు। బానిసలగుదురు ॥కాం॥

చ॥ కవులైనను భూ । ధవులనైనను ధర
జ్ఞానులైన నీధనము । కెదానులు ॥కాం॥
చ॥ శ్రీవిభు నంతటి । దేవునికైనను
చావదాశ - ధన - చానల - యెడలను ॥కాం॥

రంగ—అవధానులుగారు-ఆహా ! ఏమిపాండిత్య మేమిపాండిత్య మేమి పాండిత్యము-ఎంతచక్కగా సెలవిచ్చితిరి- ఒకవేళ మీరుకూడా కవులుగారుగదా !

అవ—(నవ్వుచు) ఓసీ వెఱ్ఱిదానా ! నేనా ! నేనొక పండితుడనేగాదు ఒక కవినేగాదు-ఒక ఘనాపాటినేగాదు-ఒక జ్యోతిష్యుడనేగాదు ప్రపంచములోగల విద్యలన్నియును నాకు కరతలామలకములు. నా పాండిత్యమిప్పు డేమున్నది-ఏది. చతురత్వమున్నను నా వయసులో నుండెడిది-అప్పుడు సన్మానమాహ్వానము జేయని యాడుదిగలదా ?

రంగ—అబ్బా ! అట్లా ! తెలిసినది ! అవధానులుగారు ! మీ రింత వయసు మళ్ళిన వృద్ధులుగదా ! మీకింకను వేశ్యాసంపర్కమెందులకు చెప్పుడు.

అవ—సరిసరి ! మంచి బాగుగా జెప్పితివిలెమ్ము.

ఆ॥ వె॥ పడతి స్తనయుగంబుపై ♦ భ్రాంతిబోవునే
బూదెయ యెడువరకు ♦ పూరుషునకు
వయసు ముసలిదైన ♦ వాంఛయు ముసలియా
దొడ్డికాళ్ళరామ ♦ దొడ్డభీమ.

రంగ—బాగుబాగు ! ఇది మీ స్వంతకవిత్వము వలెనున్నదే.

అవ—ఔను ! మృదుమధుర సరసరస గాంభీర్యపరంపరలతో నిండి [illegible]మైన నా కవిత్వమును విని యానందించిపోవుటకై [illegible]దూర దేశమునుండి సైతము - లక్షాధికారులు జమీందారులు రాజాధిరాజులు ప్రతిదినమును నా దర్శనమునకు వచ్చి కానుకలు సమర్పించుచుండెడివారు.

రంగ—మేలుమేలు ! అటులైన - ప్రతిదినమును మీరెవ్వరిదర్శనమునకుబోయి కానుకల సమర్పించెడివారు ?

అవ—నేనా ! వేశ్యాసుందరులకు.

రంగ—ఏకాక్షి లోకసంహారి యనునట్లు ఒంటికంటిచూపుగదా ! మిమ్మే వేశ్య వరించినది?

అవ—అమరఘురుసముడను, నన్నుగోరని దెవ్వ తెగలదు ?

రంగ—ఔనౌను ! ఆమాటయు సత్యమేయగును.

అవ—సరిగాని - ఈరేయికేమిబుచ్చుకొనెదవు?

రంగ—రేయికి వీలులేదు - జమీందారుగారు వచ్చెదరు - ఇపుడైన చో నేయభ్యంతరమును లేదు.

అవ—(ఆశ్చర్యముతో) ఆ! అదియేమి? పట్టపగలేనా ?

రంగ—రీతిదప్పినవానికి రేయియేమి? పగలేమి? అదిగాక - వేశ్యా సంపర్కమున కాదోషములేదు - అందునను మీరనుభవజ్ఞులుగాని క్రొత్తవారుగారుగదా ! నావంటివేశ్యల నెందరినో మచ్చుజూచిన మీకుకూడా పవలు రేయియను పట్టింపుకూడునా ?

అవ—సరిసరి ! తిరిగి నాకేదెచ్చిపెట్టితివా ! పోనిమ్ము. వగలాడీ ! నీసుంక మెంత?

రంగ—ఏకభోగమున కేక సువర్ణము.

అవ—అబ్బా! అటులైన నారిందా చేతులలో లెక్కబెట్టదగిన దానవే యగుదువు-కానిమ్ము ఇదిగో సువర్ణము (యిచ్చును.)

రంగ—(కనులకద్దుకొని) వృద్ధులైనను మీరు మంచి రసికులు - అవధానులుగారు ! నాయందము మీకు నచ్చినదా?

అవ—ఓసీ పిచ్చిదానా! ఇపుడీ యూరనున్న వేశ్యలందరును, నీపైన బలాదూరని, యెల్లరనుకొనుట చేతనేగదా ! నేను నీకొరకు వచ్చితిని-ఇక నందమందువా ? అందగత్తెలలోకెల్ల నందగత్తెవు-నీయందమునుజూచి యభివర్ణించుటకు సహస్రాక్షుడైనను చాలడనిన, నాశంటి యేకాక్షికెట్లు సాధ్యమగును!

(తెరలో వెంకయ్యకాపుగారు వచ్చుచున్నారు.)

రంగ—(ఆతురతతో నటునిటు బరువెత్తుచు) అయ్యో! ఇంకేమున్నది కొంప మునిగిపోయినది-ఇపుడేమిగతి - అవధానులుగారు-

అవ—రంగనాయకీ !నాకేమిగతి (భయముతో పరువెత్తుచు) అయ్యో!
రంగనాయకీ నాకేమిగతి — రంగనాయకీ—రంగనాయకీ—ఓ
రంగనాయకీ—అమ్మమ్మో—రంగనాయకీ—

రంగ—అవధానులుగారు-అయ్యో ! ప్రమాదము సంభవించినది -
కాపుగారు మంచివారుగారు - కర్కోటకహృదయులు-కర్మముగాలి
వారు వచ్చినచో, మన యిరువురకును చావుదప్పదు.

అవ—(వడవడవడకుచు) చావే - చావే - అమ్మబాబో చావే -
రంగనాయకీ - అయ్యో - చావనిన నాకు చాలా భయము -
నేనిపుడెక్కడికి బోను - నాగతియేమి - రంగనాయకీ - నన్నెచట
నైన దాచి, నా ప్రాణముల రక్షించి పుణ్యమునుగట్టుకొనుము—
(అటునిటుబరువెత్తుచు) రంగనాయకీ నన్నెచట దాతువు-చెప్పుము-
చెప్పుము-నా కాళ్ళు వడకిపోవుచున్నవి - బ్రాహ్మణ ప్రాణమును
రక్షించిన నీకెంతయు సుకృతముండును.

రంగ—అయ్యా ! ఆ తెరవెనుక దాగి నిశ్శబ్దముగానుండుడు. ఊఁ -
తొందరగాదాగుడు-ఇంకను చూచెదరేమి.

అవ—అమ్మయ్యా ! రక్షించితివి (వెళ్ళి తెరవెనుక దాగును)
(వెంకయ్యకాపు ప్రవేశించును.)

రంగ—ఓహో! మహానుభావులు దయజేసిరా ! వందనములు - రండు
నేడు మా గృహము పవిత్రమైనది - ఎన్నడును మా యింటివైపు
కన్నెత్తిజూడని వెంకయ్యకాపుగారు నేడరుదెంచుటయేమి విచిత్రము! వచ్చుట!

వెంక—రంగనాయకీ ! నీ సౌందర్యమెల్లరును గొనియాడ విని వచ్చి
తిని. ఔరా, ఏమి నీ జగన్మోహనాకారము!

—: రంగనాయకి - వెంకయ్యకాపు-డైలాగ్-ఆది-మూండ్ : —

వెంక— ప॥ చెలియా నీయధరామృతపానము ।
జేయగవచ్చితినే ముదమలర॥ చె॥

అ॥ కలికిమిన్ననిను । కౌగిలింపగను ।
కాంక్షజనించెను నామనమందున॥ చె॥

రంగ— దయగలిగినదా నేటికే నాపై ।
ధన్యనైతినో ప్రాణవల్లభా
దయ చేయుడుమీ కోరిక దీర్తును ।
తడవిక నేలా వేశ్యాపాలా॥ ద॥

వెంక— చ॥ కాసులపేరిదె । గైకొనుమబలా ।
కడు వేడుకతో నీకై దెచ్చితి ।
నీసరివారిని నే నెటగానను ।
నిరుపమగుణ జగదేక మోహినీ॥ చె॥

వెంక—కనకాంగీ ! కాసులపేరిదిగో - ఇదిమనప్రధమసమావేశచిహ్నముగా దెచ్చితిని (ఇచ్చును.)

రంగ—(పుచ్చుకొనికనులకద్దుకొని) ఓహో ! ఏమిమీ దాతృత్వము-ఏమిమీప్రియానురాగము-సంతోషము- (పరికించి) ఆహా ! ఈకాసులపేరెంతయందముగానున్నయది-ఆర్యా ! మీరుప్రధమవీక్షణముననే నాచూడ్కులను మీపైపునకుద్రిప్పుకొనగల్గితిరి-ఇకనీకాసులపేరిచ్చి, స్వప్నమునన్నైనమరువకుండ,కలకాలము, మదీయమానసప్రేమసామ్రాజ్య సింహాసనమునకు పట్టభద్రులైతిరి. సందేహించెద రేల, కూర్చుండుడు.

వెంక—(కూర్చుండి) రంనాయకీ ! ఈకాసులపేరునీకొరకై కలకత్తానుండి తెప్పించితిని. తెలిసినదా-నాగొప్ప.

రంగ—ఔనౌను. ప్రథమసమావేశముననే కాసులపేరుకానుకగా సమర్పించిన, మీగొప్పను గొనియాడవలసినదే - ఏజమీందారు మాత్రి మింత త్యాగము జేయగలడు?

వెంక—త్యాగమునకా ! నావంటి త్యాగి యీ పట్టణముననేగాదు భారతదేశమున నెచ్చటనులేడు.

రంగ—ఆమాట సత్యమేయగును ! దాని కిదియేసాక్ష్యము.

వెంక—అది సరిగాని, రంగనాయకీ ! నేచెప్పబోవు మాట జాగ్రతగా వినుము-నేను బహు గుట్టుమనిషిని-నావిషయమున నీవు చాలా

రహస్యముగా ప్రవర్తింపవలెను- నేనొక గౌరవ కుటుంబమునకు జెందినవాడను - నాయన్నదమ్ములకు తెలియకుండ నాగుట్టునేను గాపాడు కొనుచుంటిని- ఏవేశ్యయైనను, నా రాకపోకలు దేవునికైనను తెలియకుండ గాపాడుచుందును. వింటివా.

రంగ — భయపడకుడు. మీరు మిక్కిలి పిరికివారువలెనున్నారే-మీరు నాయింటికి వచ్చిపోవు విషయము, త్రినేత్రునికైనను తెలియనీయను. వినుడు నాప్రజ్ఞ:

గీ. వాకిటను కేసరిని గట్టి ♦ వైచి హస్తి
తుళ్లకాజాడకింత మా ♦ దొడ్డిలోన
పొద్దువాలిన సన్నమై ♦ పోవునీత
చెట్టునీడను దాతుము ♦ చెలగి కరిని.

వెంక — మేలు మేలు! అదీలెక్క - ప్రజ్ఞంటే అలావుండాలి - వేశ్యయనగా సంసారి గుట్టునట్లుగదా దాచవలయును - రంగనాయకి నీ చాకచక్యమునకు నేనెంతయును సంతసించితిని.

డాఫ — (ప్రవేశించి) ఔనౌను! నేనుకూడా సంతసించితిని. అయ్యా! వెంకయ్యకాపుగారు! ఇంత కష్టపడి మిమ్మిచట కతిరహస్యముగా, బ్రహ్మకైనా తెలియకుండా తీసుకొనివచ్చితినిగదా! మరి నా కట్నముమాట మరచిపోయితిరా యేమిటి?

వెంక — లేదులేదు - నే నెన్నటికిని నిన్ను మరచువాడనుగాను. నిన్నేగాదు నీవుజేసిన యుపకారమునుకూడా నా జన్మలో మరచిపోను - వేశ్యావాటికకువచ్చు నాబోటి సరసులు, నీవంటి డాఫరులను గొప్పగా బహూకరింపవలయును. గదా! ఇదిగో నీకట్నము (యిచ్చును).

డాఫ — (కనుల కద్దుకొని) అదీ నాయుడుదర్జా అంటే- అలావుండాలి. వైభవా - దిగ్విజైభవా - ధీరాధిధీర-డాఫరుజనాధార - అధైర్యాస్థిరగుణగణసమీర-కాపుకులాలంకార- వేశ్యాజనమందార-వైభవ- దిగ్విజైభవ. (నిష్క్రమించును).

రంగ—(వెంకయ్య కాపుగారి ప్రక్కనకూర్చుండి భుజమునచేయివేసి) కేవలము మీరిప్పుడు నవమన్మథునివలె నున్నారు.

వెంక—(రంగనాయకి భుజమున చేయివేసి) ఔను - మోహినీ నీప్రక్క నకూర్చుండుటచేత (ముద్దిడబోవును)

(తెరలో - లక్షాధికారులు జగ్గుశెట్టిగారు వచ్చుచున్నారు.)

రంగ—(కంగారుతో లేచి) ఆ! ఆ! జగ్గుశెట్టిగారే! వచ్చుచున్నారా! అమ్మయ్యో! ఇంకేమున్నది - కొంపనిలువునను కూలిపోయినది. కాపుగారు - కాపుగారు - జగ్గుసెట్టిగారు మాచెడ్డవారు - ఆయన వచ్చినచో మన యిరువురకును చావుదప్పదు.

వెంక—(లేచి నిలువబడి నివ్వెరపాటుతో) అయ్యో! రంగనాయకీ! చావునకు నేను జడియువాడను గానుగాని, రహస్యప్రవర్తనుడ నగు నాగుట్టు బట్టబయలగునని నేను భయపడుచుంటిని - నేనిప్పుడేమి సేయను-నా మానమును మంటగలిపెదవా - రంగనాయకీ రంగనాయకీ- నన్నెచటనైనా దాచుము - నీకు పుణ్యముండును.

రంగ—అదిగో - మీరా తెరచాటున దాగుడు (వేరొక తెర జూప వెంకయ్య కాపు తెరచాటున దాగును.)

(డాఫరు జాకీ జగ్గుశెట్టిగారితో ప్రవేశము.)

డాఫ—రంగనాయకీ! వీరియూర గొప్ప శ్రీమంతులు - వైశ్యోత్తములు - వీరు నీకొరకువచ్చిరి - నీ భాగ్యము పుచ్చినది - కుబేర సన్నిభులైన వీరి నెట్లు గౌరవింతువో సుమా?

రంగ—ఓహో! షావుకారుగారా! వందనములు! దయచేసి యీ యాసన మలంకరింపుడు. రండు, చూచెద రేమి?

జగ్గు—హిహిహిహిహి హాహాహాహా - (నవ్వుచు కూర్చుని పొట్ట సవరించుకొనుచు వికృతస్వరముతో) అబ్బా! ఈపాడుపొట్ట వంగటంలేదేమంటాను- అయితే అన్నీ సరేగాని - రంగనాయకీ - నే నెవ్వరినో నీకు తెలుసాఅంటాను.

రంగ—చిత్తము - లక్షాధికారులు - నవమన్మథాకారులు.

జాఫ—మహేంద్ర వైభవసన్నిభులు - మార్తాండ తేజులు - సకల వేశ్యాజనమనోరంజకులు-లక్ష్మీపుత్రులు.

రంగ—అంతియేగాదు - పరధనాపహారులు - ప్రచండ భయంకర స్వరూపులు - మదీయ హృదయాపహారులు - లంబోదరులు (చెక్కిలిపై బొడచును)

జగ్గు—చెక్కిలిపైచేయిబెట్టి-(హహ్హహ్హహ్హహ్హహ్హహ్హహ్హహ్హహ్హ) భేష్ భేష్-ఏమాటలు, ఏమానందం.నీచేతిపోటెంతసుఖంగావుందంటాను-వహ్వా-వహ్వా-బలే-బలే-పోయినాప్రాణం మీచేతులో పోతేచాలాసుఖమంటాను-మెదవపుట్టుక మాదేంపట్టుకంటాను-మీభోగందేవేంద్రభోగమంటాను-మీసరసనొకక్షణంసేపుపడుకుంటేనే చాలంటాను-ఆపురుషుడికిక స్వర్గమేగాని నరకంలేదంటాను-అన్నీసరేగాని, రంగ నాయక్కి నువ్వాడదానవైనా-కవీశ్వరుడవుకాకపోయినా- నాచక్కదనం మాచక్కగా వర్ణించావంటాను.

రంగ—చక్కదనములోననా మీకు చందమామకూడా సాటిరాదు-వెయ్యేల నామాటలు వేదాక్షరములుగా నమ్మండి. సెట్టిగారూ-మీ మీాద కంతు, జయంత, వసంతాదులు కూడా దిగదుడుపు - విన్నారా !

జగ్గు—విన్నాను - విన్నాను - అందుకనే నీవు నాకుమనసిచ్చిబాగా మాట్లాడుతున్నా వనుకుంటాను-నాఅందం నీకుబాగానచ్చిందనుకుంటాను - నీవు నన్ను నిజంగా ప్రేమిస్తున్నా వనుకుంటాను. రంగినాయకీ_అంతేగాదు.

రంగ—అంతే అంతే దానిలో నబద్ధములేదు.

జాఫ—అంతే-అంతే-అందులో నావగింజంతకూడాఅబద్ధంలేదు. సేటుగారూ ! నా కట్నము నాకిచ్చి బంపుడు.

జగ్గు—సరిసరి, ఇదిమా-బాగుందంటాను; నాకు తోచిందేదో నే నిచ్చుకుంటాను, నీవుమాత్రం గట్టిగానరచి అల్లరి చేయవద్దంటాను.

దేవుడికిచ్చే దక్షిణతప్పినా, బ్రాహ్మలకిచ్చే సంభావనతప్పినా, సర్కారుపన్నుదప్పినా, ప్లీడర్లకిచ్చే ఫీజుతప్పినా, జవానులకిచ్చే లంచాలుదప్పినా, క్లర్కులకిచ్చే మామూళ్లుదప్పినా, పడుపు గత్తెలకిచ్చే పైకముదప్పినా ధాపరుకిచ్చే భత్యంమాత్రం తప్పదనుకుంటాను. ఏదోలే నీమిడుకుడు నువ్వు మిడకమంటాను. ఇదిగో ! డబ్బులు (పావలాయిచ్చును).

ధాప—(పుచ్చుకొని) రామ రామ పావలాడబ్బులటండి షావుకారు గారు! ఎంతబీదవాడైనా పావలాడబ్బులు నాచేతిలోబెట్టినవాడింత వరకును, వేశ్యాగృహమునకు వచ్చిలేడు - అయ్యా! నన్నింత చిన్నచూపు చూడటం మీకు ధర్మముగాదు - ఏదో కాస్త కని పెట్టివ్వండి.

జగ్గు—ఏదో లే - అక్కడికిసంతోషించమంటాను.

డాఫ—గొప్పప్రభువులు మీరలా సెలవియ్యరాదు.

జగ్గు—సరేలే ! యిదిగో ఈ పావలాకూడాపుచ్చుకొని ఇక్కడకు తృప్తిపడమంటాను.

డాఫ—(పుచ్చుకొని కండ్లకద్దుకొని) అదీ దర్జాఅంటే అల్లాగుండాలి. డబ్బులేని త్యాగికంటే డబ్బున్న పాడిపీనుగే మేలంటారు పెద్దలు. జైభవ - దిగ్విజైభవ - వైశ్యకులసముద్రపారావారరాకాసుధాకర - ధారుణీసింహాసన-లొడలొడగాంభీర్య - హుళక్కి-ప్రతాప-నాస్తికదానరాధేయ - జైభవ - దిగ్విజైభవ. (నిష్క్రమించును)

రంగ—(జగ్గుసెట్టి ప్రక్కసకూర్చుండి మీదచేయివేసి)షావుకారుగారు! నాకేమిబహుమానమును దెచ్చితిరి?

జగ్గు—దానికేమీ పరవాలేదంటాను - నీకూనాకూ స్నేహంగలవాల గాని, బహుమానాని కేమిలోటంటాను - ఇద్దరు మనుష్యులు కలవాలంటాను - వెదవడబ్బేమి శాశ్వితమంటాను.

రంగ—జగ్గుసెట్టిగారు ! మాకు ధనమే ప్రధానమని మీకు తెలియనివిషయమూ యేమి ?

జగ్గు—సరిసరి - ఇది మాబాగుందంటాను. నీకూ నాకూ కాతా కలవందే - నేనొక దమ్మిడీకూడా నీకివ్వనంటాను - నేను చచ్చిపోయినతరువాతైనాసరే నిజమే చెప్పుతానుగాని, అబద్ధమాడనంటాను.

రంగ—బాగు బాగు - గర్భదానము ముందు పెండ్లి వెనుకయను నట్లున్నదే! మీ మాయదారిమాటలు చూడగాను - ఏసను. ఇంత పిసిని గొట్టువారు మీరు నాకేమిచ్చెదరు - నేను మీకెట్లువచ్చెదను - ఈ బేరము కుదరదు అనావసర కంఠశోషమెందులకు - మీరిక మీ దారిని నడువవచ్చును.

జగ్గు—ఒహ్హో - నేనివ్వకపోతే నాకు మించి నీ కెవ్వరివ్వగలరంటాను. నిన్ను సంవత్సరాల తరబడిని నేను పెంచగలనంటాను - నీతో సరసాలాడి సంభోగం చేయందే నేను యింటిదాటి పట్టనంటాను. నువ్వు పెద్దాశకు పోవద్దంటాను - కాలం మారిపోయిందంటాను. నీ వొంటి ప్రాణానికెంతో డబ్బవసరము లేదనుకుంటాను - రోజులను బట్టి బాగా పారజూచిమాత్రం డబ్బడగమంటాను.

రంగ—అబ్బబ్బా! మీ దండకానికి తరుగూ విరుగూ కూడా లేదుగదా శెట్టిగారు, వినలేక నా చెవులు చిల్లులు బడుచున్నవి - ఈ సోది చెప్పుట మాని నెలకేమిచ్చెదరో చెప్పుడు.

జగ్గు—ఓ - లెక్కేంటి - పుష్కలంగా నెలకిరువై రూపాయలు నీ దర్జాకు లోటురాకుండా నేనిస్తానంటాను.

రంగ—ఓసోసీ! ఇంతేనా? మహాభాగ్యం - ఇరువది రూపాయలు నాకేమూలకు వచ్చును! ఇన్ని మాటలెందుకు శెట్టిగారు - అథవా నెలకు వందరూపాయలైతే, నాతో మాటలాడుడు.

జగ్గు—ఓయబ్బో - మంచి గట్టిదానవేనంటాను - నెలకు వందరూపాయ లెవ్వరివ్వగలరంటాను - నీ మాటలువింటే నాకు నవ్వువస్తుందంటాను - కలకటేరుకూడా యింత జీతం లేదనుకుంటాను -

నాతో యిన్నిమాటలు పనికిరావంటాను - నీకిష్టమైతే నెలకు యిరవై యెనిమిదిరూపాయిలిస్తానంటాను.

రంగ—మంచిది. మీమాట తీసివేయను - నాసమ్మతమే.

జగ్గు—మరచేపోయాను - ఇంకొకమాట చెప్పాలనుకుంటాను - ఇరవై యెనిమిదిరూపాయలు నెలకివ్వడమన్న పేరేగాని - నీకు ముట్టేయి నెలకు పాతికరూపాయలేనంటాను.

రంగ—అదియేమి ? తక్కిన మూడురూపాయలో.

జగ్గు—నువ్వు నెలకు మూడురోజులు వెలపలుంటావనుకుంటాను. మరా మూడురోజులకును మూడురూపాయలు నాగా కడతా నంటాను.

రంగ—నారాయణ - నారాయణ - బయటున్న మూడురోజులకు కూడా నాగాకడతారటండీ! మీరు మంచి పిసినిగొట్టువలెనున్నారే.

జగ్గు—ఈ లెక్క ప్రకారం నీకిష్టమూ లేదా అంటాను.

రంగ—మీరు కోరివచ్చిన నాకిష్టము లేదందునా ?

జగ్గు—అలాగయితే వొప్పుకుంటానుకాని, మరొక మాటంటాను. నన్నుదప్ప యింకా రెండోకకూర్తి కడగూడదంటాను. నన్నే గాదు నారాయణమూర్తినైనా సరే కన్నెత్తి చూడకూడ దంటాను. నాయానతి కమ్మైనా దాటగూడదంటాను.

రంగ—అలాగేనని నే నొప్పుకుంటాను.

జగ్గు—నీ తోడని సత్తెంగా జెప్పమంటాను.

రంగ—మీతోడు - మిమ్ములను చంపుకున్నట్లు, నమ్మండి.

జగ్గు—కాదుకాదు నాతోడు నన్ను చంపుకున్నట్టనమంటాను.

రంగ—నాతోడు - నన్ను మీరు చంపుకున్నట్టు, నమ్మండి! యేదీ ఒక నెలజీతము ముందీయుడు, కావలయును.

జగ్గు—అబ్బో ! మందు నెలజీతమే ! ఇదిగో పదిరూపాయిలు.

రంగ—(పుచ్చుకొని నులకద్దుకొని) ఉదారహృదయులు.

(తెరలో జమీందారు మాధవరావుగారు వచ్చుచున్నారు)

రంగ——(భయముతో) అమ్మయ్యో! చచ్చాను.

జగ్గు——(వడకుచు తొట్రుపాటుతో) బాబుల్లో-చచ్చాను.

రంగ——(అటునిటుచూచుచు) సెట్టిగారు-సెట్టిగారు-జమీందారుగారు వచ్చినా మనకిక చావుదప్పదు.

జగ్గు——(అటునిటు బరువెత్తుచు నాయాసముతో వగర్చుచు) చావే-చావే అమ్మబాబో. చావే - రంగనాయకీ! రంగనాయకీ! నే నెక్కడదాకోనంటాను, చ-చ-చ-చ-చ-చావంటే నాకు చాలా భయమంటాను. ని-ని-ని-ని-ని-ని-నీకు పుణ్యముంటు నంటాను. న-న-న-న-నన్ను రక్షింపుమంటాను. (గజగజవణకుచు భయోద్రేకమున మాట తొట్రుపడుచు రంగనాయకి చేతులను బట్టుకొని బ్రతిమలాడును)

రంగ——అయ్యో! సెట్టిగారు! ఇంకను చూచెదరేమి? తొందరగా ఆ సోఫాక్రింద దాగుము - ఊఁ! ఊఁ! దూరుడు, దాగుడు.

జగ్గు——అమ్మదేవుడా! ఇప్పుడు నేను బ్రతికిపోయానంటాను. (గబగబ సోఫాక్రింద దూరి దాగును.)

(చేతిబెత్తముతో - కండ్లజోడుతో - సూటు - బూటు-హ్యాటుతో మాధవరావు, ప్రవేశించును.)

రంగ——అలో, మై డియ్యర్ ఫ్రెండ్, మాధవ్.

మాధ——అలో మై డియ్యర్ లేడీ, కమాన్,

(యిరువురును వొక్కసారిగా - అని-చేతులు గిలుపుకొని కౌగిలిడుకొని ముద్దిడుకొని సోఫాపై నాసీనులగుదురు)

మాధ——సుందరాంగీ! నేను వచ్చిపోవుచుండుట మా షణ్ముఖునకు మాత్రము తెలియనీయకుసుమా.

రంగ——హృదయచోరా! సకలవిద్యలను జన్మతోడనే దెచ్చుకొనిన మాకు మీరింతగా జెప్పవలయునా? వేయేల వినుడు.

గీ. తండ్రితోడ గ్రీడించుచు ♦ తనయునొక్క-
మూలదాతుము - సుతునితో ♦ మునియువేళ
తండ్రి యేతెంచెనా ప్రాజ్ఞ ♦ తనుమెరయగ
తనయు తలవెంటుకలచాటు ♦ దాచగలము.

మాధ — ఔనౌను - మీరింతటినేర్పరులేయగుదురు - సందేహము లేదు - మందయానా - మదనుడదయుడై తన తీవ్రనారాచములచే నన్ను మిక్కిలి బాధించుచున్నాడు.

రంగ — మోహనాకారా! మీ హితురాలనైన నేను మీయండగలిగి యుండ మిమ్మా మదనుడేమిచేయగలడు? నాధా! త్వరితగతి నిపుడే జని కేళీగృహమునహంసతూలికాతల్పంబున విచిత్రతరబంధనాప్రౌఢ సంగ్రామమున మనమిరువురమును గలసిమెలసి గర్వోన్మత్తచిత్తుడగు నా మదనుని మదమడంగించెదమురండు. (ఇరువురును చేతులు గలుపుకొని నిష్క్రమింతురు.)
(డాఫకుజాకీ రబ్బరుపాముతో ప్రవేశించి - జగ్గుసెట్టిదాగిన సోఫా క్రిందబడవేయును-సెట్టి నిజమగు సర్పమను భయముతో - వడకి పోవుచు-సోఫాక్రిందనుండి-అమ్మయ్యో తాచుపాముగోచచ్చితిని చచ్చితినని బయటకువచ్చి గంతులువేయుచుండ - తెరంలవెనుక దాగియున్న అవధానులు - వెంకయ్యకాపుకూడా బయటకువచ్చి - సెట్టివలె తాముకూడా భయకంపితులై యరచుచు నటునిటు బరువులెత్తుచుందురు.)

డాఫ — అయ్యా! మీరా దొడ్డిదారిని పారిపోయి ప్రాణములు దక్కించుకొనుడు (అని దొడ్డిదారిజూప - ఆ మార్గమున మువ్వురును పారిపోవుచుండ-ఢాఫకుజాకీ పకపక నవ్వుచుండ తెరదిగును)

## —♦ ద్వితీయరంగము ♦—

[8 గంటలరాత్రి-పబ్లికుగార్డనులో నొకప్రక్కన మునిసిపల్ లాంతరుకడ పుస్తకములు చేతఁబట్టుకొని రాజారావు నిలచియుండ తెరలేచును].

పాట—కాళింగడ.

ప॥ దీనాతిదీనుడనే జగతిని ।
దీనాతిదీనుడనే హేప్రభు॥ దీ॥

అ॥ కానవనీదయ । కరుణాసింధూ ।
దీనపాల జగ । దేకపావన ॥దీ॥

చ॥ సకలచరాచర । సముదయపాలా
అఖిలాగమనా । యార్తినిబాపుము॥ దీ॥

అయ్యో ! దైవమా ! నా యిక్కట్టుల కంతమనునదిగలదా ?

మ. కలుగుంగాక నొకానొకప్డుసుఖమున్ ♦ కష్టంబులీపృథ్విపై
గలమర్త్యాళికిగాని, నావలెను నే ♦ కాలంబు కష్టంబులే
తలపైనన్ధరియించి మోయుచు మహా ♦ దైన్యంబుతో జీవముల్
నిలుపన్గల్గినవారులేరెవరు హా ♦ నిక్కంబుచర్చింపగా.

ఆహా ! దారిద్ర్యమెంతపని జేయించుచుండును.

సీ. కానివారలనైన ♦ కాళ్ళనుబట్టించు
పెనులోభినైనను ♦ వేడబంపు
గాలిలోమేడల ♦ గట్టించుచుండును
నూరకేబుట్టించు ♦ యోచనముల
ఆకలి వేయుచు ♦ శృధికంబుగావించు
చేయిజాపించును ♦ సిగ్గుద్రుంచు
నటుపొమ్మురాకన్న ♦ నాశ్రయింపగజేయు
మానాభిమానముల్ ♦ మంటగలుపు

గీ. హీనమైనట్టిపనుల జే ♦ యించిమించు
కన్నములనైనవేయించు ♦ కారనుంచు
మహిని దారిద్ర్యదేవతా ♦ మహిమయెదుట
దేవదేవుని మహిమంబు ♦ దీసివేత.

అది యటులుండ నన్నిటికంటెను చిత్రిమేమనిన;

గీ. ధనముగలిగినవారికి ♦ వినయముతోడ
పూర్ణమగు విద్యనబ్బుట ♦ పూజ్యమంబు
వినయముంగల్గువారికి ♦ ధనముగూడ
పోషణమునున్న విద్యాభి ♦ లాషమెంచు.

అయ్యో! భగవంతుడా! నే నెందరికాళ్లుబట్టుకొని చదువుకొను చున్నను, యెప్పటికప్పు డేదియో యొకటి వెలితి గనుపించుచునే యున్నదిగదా!

మ. చదువన్ దీపముబుడ్డిలేసి యపుడీ ♦ చందాన నీలైట్లై నా
కుదయన్ జూపెడు చుట్టపక్కములునై ♦ గూర్మిన్ దగన్నూర్చియూ
పదకాలంబున సాయమయ్యె నిక దీ ♦ పంబుల్ యివే దేవతల్
గద నా పాలికి జన్మ మర్థ్యమగువం ♦ గాబోవనే నాటికిన్.

(లాంతరు వెలుగున చదువుకొనుచుండును.)

శకుంతల—(ప్రవేశించి విస్మయముతో) రాజారావ్! ఇదియేమి? ఈ లైటువెలుగున నిలువఁబడి చదువుచుంటివి?

రాజా—(తుళ్ళిపడి శకుంతలను జూచి) శకుంతలా! ఏమిచేయగలను. ఉండుటకు రూములేదుగదా! ఇక దీపమునకు చమురు నేనెచ్చట నుండి తేగలుగుదును? నేనొక గర్భదరిద్రుడనని నీకు పూర్తిగా దెలియదుగాబోలును.

గీ. కష్టజీవిని నేనదా ♦ నష్టజాత
కుడను నిర్భాగ్యుడను దుఃఖి ♦ తుడను బతితు
డను యనాథుడ దలపగా ♦ వనిని యున్న
కలరె నను బోలు కష్టజీ ♦ వులు ధరిత్రి.

గీ. అవనిలోపల నుద్భవ ♦ మందినట్టి
జ్ఞానయుతమైన మానవ ♦ జన్మలోన
యెట్టి పాపులకైన నా ♦ యట్టి కష్ట
జీవితముగూర్పకయుహరి ♦ జేయుగాక.

విద్యావతివగు నోసుశీలా ! శకుంతలా !

గీ. ఎట్టి దుష్కర్మహర్తంబున ♦ బుట్టినానో
యెట్టి ప్రాణ్యుల కెడబాటు ♦ బెట్టినానో
యెట్టి పాపంబులను జేసి ♦ యిట్టి చింత
లనుభవించుచునుంటినో ♦ యవనిలోన.

గీ. కుడువ నన్నంబుగట్టగా ♦ గుడ్డలేక
భారతావని నావలె ♦ భయుదరోగ్రి
క్షామదేవత జవ్వాగ్రి ♦ సీమజిక్కి
బీద విద్యార్థులందెడి ♦ బాధలెల్ల
స్వానుభవమునగాంచి వే ♦ సారియుంటి.

శకుం—రాజారావు ! ఇన్నికష్టముల నీవనుభవించుపట్ల నా తండ్రిగారి నేల దర్శింపవైతివి ! వారు నిన్నెంతయు నాదరింతురే! కాపాడు వారికి కష్టమును జెప్పుకొనవలదా.

రాజా—శకుంతలా ! ప్రతివిషయమునకును నోరుదెరచి వారి నడుగుటకు నాకు మిక్కిలి సిగ్గుకలుగుటయేగాక భయముకూడా గలుగుచుండును. నిజము చెప్పవలసివచ్చిన మీ తండ్రిగారి దయవలననే నేనింతవరకును చదువగ్గలిగినది వారు నాకుజేసిన సాయము నా జన్మమున్నంతవరకును మరువజాలను కాని, నా దురదృష్టమునకు వారేమిజేయగలరు.

శకుం—రాజారావు! ఇది విధికృతము. చింతింపకుము ఎల్లకాలమిట్లే యుండునా యేమి ? ఇదినీకు చీకటిపినము

గీ. కష్టముల స్వానుభవమెట్లు ♦ గాంచినావో
సుఖకము లిక ముందటులె చవి ♦ జూడగలవు
శిష్టమతివైన నీకు నే ♦ జెప్పనేల
చీకటులువోయి వెన్నెల ♦ దాకయున్నె.

రాజారావు ! కష్టములపట్లనే నీవంటి యుత్తములు స్థిరత్వముగలిగి యుండవలయును చలింపక మోదృ్వగలిగి యుండుము. నీకు చదువుచ్చుకొనుటకొక గదిసమ్మని నా తండ్రిగారితో జెప్పెదను.

నీ దుస్థితియంతయును వారికి విశదముగావించెదను. వారత్యంత
కరుణాంతరంగులు. నీకే కొరంతయురానీయక వారు కాపాడగలరు.
నీవు తప్పక రేపుదయమున నా జనకుని దర్శింపరమ్ము. ఇదిగో!
ఈ మైసూరురూపాయలు చేతిలో నుంచుకొనుము. (యిచ్చి) సిగ్గు
పడకుము. కష్టము లెవ్వరికైనను గలుగుచునే యుండును. మేము
మాత్రము గడచి బ్రతికితిమా యేమి? జన్మమెత్తిన ప్రతివ్యక్తి
యును కష్టసుఖము లనుభవించి తీరవలసినదే! ఉదయమున
రావలయును సుమా.

రాజా — మంచిది. కృతజ్ఞుడను. శకుంతలా! భారతదేశమున నీవంటి
గుణవతులు కొందరు విద్యావతులై యుండుట వలననే గదా;
విద్యావిషయమున విమర్శనా దృష్టిగలిగి నావంటి బీద విద్యార్థు
లకు సహాయపడుట సంభవించుచున్నది. కావున పురుషులేగాక
కాంతాలోకమంతయును తప్పక విద్యావతులు గావలయును.
అప్పుడుగాని, మన భారతదేశము బాగుపడదు.

శకుం — ఔను అదిసత్యమే యగును. రమ్ము పోవుదము. (ఇరువురును
నిష్క్రమించుచుండ తెరదిగును.)

---

## — తృతీయరంగము —

[తెరలేచిన [illegible] శకుంతల వాహ్యాళికై వచ్చుచుండ,
మాధవరావు యెదురుపడును].

మాధ — హాలో మై డియర్ లేడీ! శకుంతలా! గుడీవ్నింగ్.

శకుం — ఓహో! మాధవరావుమహాశయులా! బాగుబాగు.

మాధ — సుందరీ! నీ వివాహ మెప్పుడు?

శకుం — నా పెండ్లియా? లగ్నమునాడు.

మాధ — (పకపకనగుచు) సరిసరి మరి వరుడెవ్వరు?

శకుం — పెండ్లికుమారుడునతడు సరి మీ పెండ్లియెప్పుడు?

మాధ — చక్కని నవలాకరగ్రహణము జేసిననాడు.

శకుం — మేలుమేలు! చక్కని శవకరగ్రహణముగాదుగదా?

మాధ—గజగమనా ! ఇంతటి భాగ్యవంతుడను. నాకు శకుంతలా కరగ్రహణము సేయునంతటి గతి యేమిగలిగినది ! సుందరీ ! నెరజాణవగు నిన్నే నేను పెండ్లియాడెదను.

శకుం—(నవ్వుచు) ఔను ! పాపము ! మీరు మంచి సద్గుణవంతులును, విద్యాధికులు గనుక.

మాధ— వెరివెల్ ! శకుంతలా ! వేయిజన్మములెత్తినను, నావంటి పతినీకు లభింపగలుగునా !

గీ. అమరు వెలమించు మృదుదుకూ ♦ లములురత్న
భూషణంబులనెన్నొసిగి ♦ పొందదాల్చి
రమ్యమందిర వనవిహా ♦ రములసౌఖ్య
మందిజాలెదు ననుబెండ్లి ♦ యాడుమబల.

శకుం—ఔనౌను! ఆమూఁజన్మమెత్తినంతుల కాఁశిన మిమ్మే పెండ్లియాడ వలయును. ఏలనన,

గీ. తల్లిదండ్రులయాజ్ఞను ♦ తేఁనుదాల్చు
సుగుణవంతుడుమిక్కిలి ♦ సుజనహితుడు
సకల విద్యాధికుండు మీ ♦ యట్టిభర్త
రమణికి లభింపభువిని దు ♦ ర్లభముగాదె.

అదియునుగాక ! ఏవిధముగజూచినను, నేను మీకు దగినదానను గాను. మిమ్ము పెండ్లియాడు స్త్రీరత్న మన్నివిధములను మీకు దగియుండవలయునుగదా ! ఆర్యా ! మీకును నాకును హస్తిమశకాంతరము గలదు; కావున మన యిరువురకును దాంపత్యము దగియుండదు. మీకుదగిన తరుణీశిరోమణిని వెదకి పెండ్లియాడి సుఖింపుడు. నాకిక సెలవు. (పోబోవును).

మాధ—(శకుంతల చేయిబట్టుకొనియాపి) శకుంతలా ! అన్నివిధములను నీవు నాకంటె వేయిరెట్లధికురాలవు గనుకనే, నేనునిన్ను పెండ్లియాడగోరితిని కాని సామాన్యయువతివైన నేను పెండ్లియాడ సమ్మతింతునా ?

శకుం—అది సత్యము, మీరు లక్షాధికారులుగావున,

మాధ—చతురమతీ! నీవు వకీలు పుత్రికవుగదా! అందునను - ఎఫ్-ఏ సీనియర్ - విద్యావతి శకుంతల.

శకుం—మరి మీరో?

మాధ—నేనా డబల్ - ఎమ్-ఏ.

శకుం—(పకపక నగుచు) ఓహో! అటులనా! మేలుమేలు! ఆంగ్లేయ భాషాఖండిత సార్వభౌమా! మీకును నాకును యీజన్మమున వివాహముజరుగుట వట్టిమాట - విద్యాపరిపూర్ణా! వినుడు - శకుంతలాకర గ్రహణనిమిత్తార్థమై, మరల నీసారి తమరొక యువ తారమును ధరించుడు - ఇప్పటికి నాకిక సెలవు, దయయుంచుడు పోయివచ్చెద. మహాశయా గుడ్‌నైట్ (చేయి విదలించుకొని) ఎన్నడును తరుణీమణులయెడ, నిట్లు దౌర్జన్యము సేయకుండ గలందులకై, శకుంతలానామ జ్ఞాపకార్థమై, ఇదిగో! మీకొక చిన్ని బహుమాకృతి (ఒకచెంపకాయ వేసి చరచర నిష్క్రమించును.)

మాధ—(చెంపపై చేయివేసి నిమురుకొనుచు) ఆ! ఆ! శకుంతలా! నిలునిలు! పారిపోకుము! మాటమాట! (గబగబ ముందునకు నడచుచుండ తెర దిగును.)

---

## —♦ చతుర్థరంగము. ♦—

[ తెరలేచిన - మన్మథుడు విచారముతో ప్రవేశించి]

అన్నా! చివరకు నాకెట్టిగతిపట్టినది.

చ. కలిమినిజూచి పొంగి పెను ♦ గర్వముజెందియు కష్టమెట్టిదో
తెలియక, తల్లిదండ్రులు గ ♦ తించిన వెన్క ను పెత్తనంబు చే
తులబడి దుష్టమిత్రులకు ♦ తోరపుకూరిమి పేకయాటకున్
కలిమిని లెక్కసేయకను ♦ కాళ్ళనుజమ్మితి మందబుద్ధినై.

అంతటితోసరిపోయినదా! ఆహా! జరిగినదంతయు స్వప్నమువలె నున్నది. అప్పుడు నాకు భూమ్యాకాశములు గనుపించినవియా.

గీ. అడిగినట్టి వేశ్యలకు లే ♦ దనక, పైన
కనకవర్షంబు గురియించ ♦ గలిగి, మేటి

భూపతివిధాన నే పొంగి పోతి, గాని
కడకు నిటువచ్చునను బుద్ధి గాననైతి.

పాట — ముఖారి - చతురశ్రి

ప॥ గర్వాంధుడనై కనుగానక యిగా ।
గతిజెడిపోయితి నా యనుభవము ॥గ॥

అ॥ కామము కనులకు । గప్పినవారికి ।
కలుగునె యుక్తా యుక్తవివేకము ॥గ॥

చ॥ నా గతిగని రైమె । నను కనులారా ।
నావలె జెడిపోకుడు యన్నలారా ।
బాగుపడుడు సన్మార్గ వర్తులై
భారతభూమిని యువజనులారా ॥గ॥

శ్రీ సోదరులారా! నా దుస్థితిని బరికింపుడు. ఎల్లప్పుడును, నా వెను వెంటనే సేవకులవలె దిరుగుచు, నడుగులకు మడుగు లొత్తుచు నన్నే దైవమువలె గొలిచి నాసొమ్ముదినిన నామిత్రులలో నొక్క డైనను నన్నీ స్థితిలో బలుకరించినవాడు గలడా! ఒకవేళ నెవ డైన కర్మముగాలి నాకెదురుపడెనా - నే నేమైన నడుగుదునని గాబోలును మొగమునకు రుమాలు చాటువేసుకొని యేసందులో నన్నోబడి మాయమై పోవును. పిలచితే పలికినట్టు. వేయేల! ధన మున్నచో మిత్రులు, ఆ ధనముకొంచము నైపోయిన వెనుక శత్రులు - అన్నిటికేమిగాని, నాకు పెండ్లి గాకపోవుటయే మిక్కిలి మంచిదనిపించినది. లేకున్న, యిట్టిసందర్భమున చేసికొనిన భార్య తోడ చీపురుగట్ట దెబ్బలు తినవలసి వచ్చెడిదేగదా! ఇక నిపుడు నా వక్కనిమాటయా ఏసత్రములో దిన్నచు వెళ్ళిపోవును. లేదా? ఎవరికైన నౌకరిజేసి బ్రతుకవచ్చును.

మాధ—(ప్రవేశించి) ఒకేబ్రదర్! సరిగా నాపనియును నీవలెనే యున్నది. నేను వరుసనే నాలుగేండ్లు ఫోర్తుఫారములో తప్పిపోయితి నని, నాతండ్రి నన్ను స్కూలు మానిపించినాడు.

మణు—సరిసరి! ఆ క్రొంచెముగూడ నయినదా! పోనిమ్ము సుఖ
పడితివిగాని, మరి యిక నిప్పుడు నాకు గతియేమి? మీ సత్రములో
స్థిరమైన తిండిబెట్టించెదవా? లేక బిక్షపు చేతబట్టుకొని వీధులవెంట
దిరుగుచు ముష్టి నెత్తుకొనుమనెదవా?

మాధ—బాగుబాగు! వంగలేనిమిత్రుడు, డేకలేని మిత్రునిపట్టుకొని
ప్రాకినట్లున్నది. నీవు జెప్పినదిచూడగా, నావిషయములన్నియును
నీకు పూర్తిగా తెలియలేదుగాబోలును. కారణముజెప్పక యిల్లు
గదలితినా నాటితో నింటికిని, నాకును మధ్య హిమాలయపర్వత
మడ్డుపడినదనినమాటయే! నాయింటిలో నే నిప్పుడొకదైదీని. నా
మిత్రు లెవ్వరయిన మాయింటికివచ్చి నన్నుబిలచినచో వారికి మంగ
ళాష్టకములు—నన్నింటినుండి గెంటివేయుట, మొదటిమరతు. కేవలము
నాగౌరవమును నేనేపాడుజేసికొంటినని యొప్పుకొనకతప్పదు. వ్యక్తి
గతమును చంపుకొనిన యస్వతంత్రుడను. ఇక నా వివాహమునకు
ప్రయత్నములు జేయుచుంటిరి. తెలిసినంతవర కెవ్వరును నాకు పిల్ల
నీయ నొల్లకుండిరి. అందునను నీ మూలమున నేను జెడి పోయితి
నని దిట్టుచు, నీమాటయానిన నాతండ్రి అగ్నిలేక యేభగ్గునమండిపడు
చున్నాడు. కర్మముగాలి, నీవెప్పుడు మాయింటికి వచ్చెదవోయని
భయపడుచు, భయపడుచు, ఈమాట నీకుజెప్పుటకే నేనిప్పుడువీలు
చేసికొనివచ్చితిని. నాఖర్చునిమిత్తమై నెలకైదు రూపాయలిచ్చు
నట్లేర్పరచినాడు. మిత్రుడవుగనుక నాపైకము నీకందజేసెదను.
దానికితోడేమైన సంపాదించుకొని పొట్టబోసికొనుము. మాయింటికి
మాత్రము రాకుము. కొంప మునిగిపోవును. నేనికపోయివచ్చెదను
ఇవిగో! ఐదురూపాయలు (యిచ్చును)

మణు—పుచ్చుకొని అయ్యో! మిత్రమా! మన పరిస్థితు లెంత
విషమస్థితికి వచ్చినవి. మన యవివేకమేగదా! దీనికంతయును
కారణము? సర్వమునుబోయిన వెనుక నాకిప్పుడు పూర్తిగా బుద్ధి
వచ్చినది. జరిగినదేదియో జరిగిపోయినది ఇకనైనను మనము
సన్మార్గమున వర్తించుటమేలు! ఆహా! తలచుకొనిన గుండె

బ్రద్దలగుచున్నది. నాదవ్యమంతయు నెట్లు మాయమైపోయినదో నాకే తెలియకున్నది. తుదకు నాజీవితమంత విషాదసంకలితమై పోయినది. ఇదియంతయు స్వయంకృతాపరాధమేకాదా! సోదరా ఇట్టి యాపత్కాలమున నీవుమాత్రము నన్ను విడువక కాపాడు చుంటివి. మిత్రుడవన నీవే మిత్రుడవు.

మాధ—మిత్రమా! మరల నొకసారి కలసి మనము కష్టసుఖముల మాటాడుకొందము - ఇప్పటికి నన్ను విడచిపెట్టుము. లేనియెడల మాటవచ్చును. (నిష్క్రమింప తెరదిగును.)

---

## —♦ పంచమరంగము ♦—

(9 గంటలరాత్రి-సందు మార్గమునబడి, శ్యామల నడచిపోవుచుండ తెరలేచును.

ఆహా! ఇదియేమి? మాశకుంతల, ఇట్టి సాడుసందులోని కెందు లకు వచ్చును? (కొంచమాగి) మిత్రురాలిఇంటి కేగుచుంటిని. 9 గంటలరాత్రికి, రామబజారుసందులోగల - 52 - నంబరు యింటికి నీవుకూడా రావలయుననిగదా! నాకు లేఖవ్రాసినది - ఒకవేళ నామె మిత్రురాలెవరైన నిచటనుండియుండవచ్చునను - కాని, ఎంత వెదకినను 52 -వ. నెంబరుగల గృహము గనుపించదే! ఈజాడ బరిశీలింప నెవ్వరో కుతంత్రముబన్ని నన్నీ తావునకు రప్పించియుండనోపు! నిశ్చయముగా నేను మోసగింపబడితిని, సందేహమేల? కానిమ్ము నేనీ నిర్జనప్రదేశమునుండే గడచిపోయె దను. లేకున్న నపాయము సంభవింకవచ్చును.

వినోదరావు—(ప్రవేశించి) బాలా! నేనుగాంగ నీకే యపాయ మును సంభవింపజాలను.

శ్యామ—(విస్మయముతో జూచుచు) ఆ! ఆ! వినోదా! ఇదియంతె యును నీమోసమా? ఇట్లుచేయుటలో నీ యభిప్రాయమేమి?

వినో—జగదేకరంభవగు నిన్ను జేపట్టుటయే.

శ్యామ—వధువును జేపట్టవలసిన మార్గమిదియా?

వినో—ఔను ! ఇది రాక్షసవివాహము.

శ్యామ—ఇట్టి రాక్షసునెన్నటికిని శ్యామల వివాహమాడజాలదు,

(శ్యామల - వినోదుల డైలాగు - పాట మాంఢ్—ఆది.)

శ్యామ—ప॥ చాలుచాలు నీ యవివేకము సకు
సంతోషించెదరా యోగ్యులు
సంతోషించెదరా యోగ్యులు ॥చా॥

॥అ॥ బాలామణి యిష్టపడని పెండిలి
భావ్యమె పురుషునకు జగతిలో
ప్రాప్తమె సౌఖ్యంబుసుంతయును ॥చా॥

వినో—ప॥ చెలియరో నాచెయి జిక్కె సదాసవు
బలిమిని గూడెద నేసుందరీ
బలిమిని గూడెద నే విడువకను ॥చె॥

అ॥ హాయిగ నీ యధరామృతపానము
సేయగనే విడువంగజాల
సేయగనే విడువంగజాల
నను బరిణయమగుమా సుశీల !
నను బరిణయమగుమా సుశీల !
నను బరిణయమగుమా సుశీల॥ చె॥

(దగ్గరకు వెళ్ళి పట్టుకొనబోవును).

శ్యామ—(తప్పుకొని) ఛీ ! మూర్ఖుడా ! దూరముగా నిలువుము. మానవతి తన ప్రాణములనైనను తృణప్రాయముగా గోల్పోవ గలుగునుగాని, మానమునుమాత్రము గోల్పోవదని తెలియ జాలవా ! పశువా !

వినో—(నవ్వుచు) కోమలీ ! నీ ప్రతిజ్ఞలు నా దగ్గర జనికిరావు. నే నిపుడు బలాత్కరించిన నీ దిక్కెవరు ?

శ్యామ—దురాత్మా ! నీ వంతటిసాహసమునకే గడఁగినచో ప్రచండ ఖండమైన నీ ప్రాణములను దీతును.

వినో—ఓహో ! సుందరీ ! నీ బెదరింపులకు నేను బెదరువాడనా ?

గీ. నిన్ను బలిమిని గూడగా ♦ నున్నవాడ
నేడు నను దాటి పోవగా ♦ నీతరంబె ?
అబల నీ వంతసాహసి ♦ వైతివేని
యేదిచూతము నీప్రజ్ఞ ♦ నెరుకబరచు.

(చేయిబట్టుకొని కౌగలించకొనబోవును )

శ్యామ—(చేతితో కంఠము నొక్కి పట్టుకొని యెలుగెత్తి) ఓపుణ్యాత్ములారా ! దురాత్ముడొకడు నామానధనము నపహరింప నున్నాడు ! రండు ! రండు రక్షింపుడు ! ఏకాకిని, అనాథను. (తెరలో తరుణీ శిరోమణి ! భయపడకుము. నే నిదేవచ్చుచుంటిని. రాజారావు తొందరగా ప్రవేసింప వినోదరావు శ్యామల చేతిని విడిపించుకొని పారిపోవును.)

రాజా——సోదరీమణీ ! శ్యామలా! నీవీ దురాత్మునిచేత నెట్లుజిక్కితివి?

శ్యామ—అన్నా ! ఈకుమతి నన్ను మాయోపాయముజేసి, శకుంతల వ్రాసినట్లు లేఖ నొకదానిని బంపి, సన్నిస్థలంబునకు రప్పించినాడు. అగ్రజా ! దేవునివలె నీవు సమయమున కడ్డుపడి, నా మానధనమును గాపాడితివి. లేకున్న నాగతి యేమైయుండెడిది ! ఆహా ! నీ యుపకారము నా జన్మమున్నంతవరకును మరువదగినదిగాదు.

రాజా——శ్యామలా ! నా సోదరీమణివగు నీయాపద కడ్డుపడు భాగ్యమును నాకు సమకూర్చిన యా పరాత్పరునకు నా ప్రణామములు. చెల్లెలా ! చింతింపకుము. ఇక్కడకు నీ వదృష్టవంతురాలవే యగుదువు. రమ్ము. నిన్ను మీ గృహమున దిగవిడచిపోయెదను.

శ్యామ— అన్నా! నేను మిక్కిలి ధన్యురాలను. నీ సహాయమున నేడు నేను మృత్యుముఖంబునుండి గెలువడగలిగితిని.

రాజా——చెల్లెలా ! నీ చింతవొగించిన యా శ్రీనాథుని సేవింపుదము రమ్ము పొద్దుపోయినది. నీ కొరకై తల్లిదండ్రు లెదురు చూచుచుందురు. (శ్యామల చేయిబట్టుకొని నిష్క్రమింప తెర దిగును.)

---

## —♦ షష్ఠమరంగము ♦—

[ఒకకుర్చీ ఖాళీగానుండును. ఆనందరావు-శకుంతల సోఫాపై నాసీనులై యుండ తెరలేచును].

ఆనం — [శకుంతలను దగ్గరకు తీసుకొని శిరము నువ్వుచు] తల్లీ !

గీ "కూతురవునైన నీవె మా ♦ కొడుకువైన
నీవె"యని గూర్మిమీర నీ ♦ కేవిధంబు
నైన కొఱతయులేక మా ♦ యమ్మనిన్ను
కన్నులలొ బెట్టుకొని పెంచ ♦ గలిగినాము.

పుత్రికా! సంశయింపక నా ప్రశ్నకు సరియగు సమాధానమిమ్ము.

తండ్రి ! గీ. క్రిందదించిన మృదుమేను ♦ గందుననుచు
ప్రేమ నిరతంబు నన్నెత్తి ♦ పెంచినట్టి
తల్లిదండ్రుల మీకంటె ♦ దైవతములు
కలరె పృథ్విని నాకు ని ♦ క్కముగ తండ్రి

నాన్నగారు ! మీపట్ల నాకు సంశయమేల సెలవిండు ?

ఆనం — తల్లీ ! ధనముగలదని, చూచుచుచూచుచు నొకానొక మూర్ఖాగ్రేసరునకు నిన్నర్పింపజాలము. పరదేశీయునకిచ్చి నీ వియోగమును సహించి మేము జీవించజాలము. వెంకటరావుగారి పుత్రుడు మా ధనరావునకు నిన్నీయవలసినదిగా కబురుజేసినారు కాని అట్టి విద్యావిహీనుడగు పలుగాకికి, నా పుత్రిక నీయజాలనని ఖండితముగా జెప్పిపంపితిని. మరియు లెక్కలేని సంబంధములువచ్చుచున్నవి గాని, అన్నిటికంటెను నిరుపేదయైనను; బుద్ధిమంతుడును, విద్యాధికుడైన, రాజారావునకు నిన్నిచ్చి పెండ్లిచేసి యింటనుంచుకొని ముద్దుముచ్చటలజూచుకొన సంకల్పము గలిగినది. అమ్మా ! గుణముకావలయునుగాని, మనకున్న ధనము చాలదా ? నీయభిప్రాయమేమియో చెప్పుము ?

శకుం — తండ్రీ ! ఈ విషయము మీరు నన్నడుగవలెనా? నిరంతరము నా మేలుగోరెడి మీ వాంఛయే నాసమ్మతము.

ఆనం—(కౌగలించుకొని శిరము ముద్దిడి) తల్లీ! నీవంటి యుత్తమురాలగు పుత్రికారత్నమును గనుటమూలమున మేము ధన్యులమైతిమి. మావంశముపవిత్రమైనది. బిడ్డా! నీవిద్యావినయములూరకపోవునా?

రాజారావు—ప్రవేశించి, అయ్యా! వందనములు.

ఆనం—ఓహో! రాజారావా! రమ్ము కూర్చుండుము. (ఎదుటకాలీ కుర్చీ జూప రాజారావుకూర్చుండును.)

ఆనం—బి - ఏ - క్లాసులో జేరితివిగదా?

రాజా—చిత్తము మీ దయవలననే - నేనింతవరకువచ్చితిని. దిక్కులేని నావంటి దీనబాలునుద్ధరించిన మీకుసర్వేశ్వరుడాయురారోగ్యైశ్వర్యములను బ్రసాదించుగాక. అయ్యా! మీ పరిపూర్ణానుగ్రహమువలననేగదా! ఈ నిరుపేద, ఈరాజారావు - ఈ - "బీద విద్యార్థి-బి-ఏ-" యైనాడు.

ఆనం—సంతోషము. రాజారావు! యిప్పుడేమైనా కావలసివచ్చితివా? ఇదిగో! నీవు - బి - ఏ - క్లాసులో చేరినందులకు బహుమానము నూరురూపాయలనోటు (నిచ్చును)

రాజా—(పుచ్చుకొని కండ్లకద్దుకొని) చిత్తము కృతజ్ఞుడను. ఆర్యా! తమ పుత్రికామణియగు శకుంతలను - వెంకటరావుగారి పుత్రుడైన మాధవరావు తన కిచ్చి వివాహము చేసెదరేమో కనుగొని రమ్మని నన్ను బంపినాడు.

ఆనం—(కోపముతో) ఆఁ! ఏమీ! ఆ తుచ్ఛునకు నా పుత్రికనిచ్చి పెండ్లి సేయవలయునా? ఈయనని వాని తండ్రి కిదివరకే కబురు బంపలేదా! వానికి బుద్ధిలేదా? ఉన్మాదావస్థ యేమైన వానికి సంభవించలేదుగదా! ఎన్నిసాహసములు ఛీ! ఛీ! పొమ్మనిపించుకొనును.

రాజా—అయ్యా! తాము నన్ను క్షమింపవలయును. వారి సత్రమున భుజించుటచే నేనీ రాయభారమునకు రాక తప్పినదిగాదు. అవిధేయుడనందురేమోయని వచ్చితిని.

ఆనం—రాజారావు ! వచ్చి చెప్పుటలో నీ తప్పేమియును లేదు. అది నీ ధర్మముకాని, మరల నీవిక ఆ దురాత్మునకు కబురుజెప్పుటకు పోవలదు. వాని సత్రములో భుజింపవలసినపని నీకికలేదు. నేటి నుండియు నీవు మాయింటనే భుజింపుము. పేదవాడవయినను, బుద్ధివంతుడవును విద్యావంతుడవు నగుటచే, నీకు నా పుత్రిక నిచ్చి వివాహముజేసి నిన్ను నాయింటనే యుంచుకొనెదను (లేచుచుండ, రాజారావు-శకుంతల-ఆసనములనుండి లేవ తెర దిగును).



# బీదవిద్యార్థి బి. ఏ.,

## చతుర్థాంకము.

### ప్రథమ రంగము.

(వినోదరావు భవనము - తెరలేచిన కూర్చీపై కూర్చుండి వినోదరావు చదువుకొనుచుండును - చినిగిపోయిన బట్టలతో, బికారివేషముతో, షణ్ముఖుడు ప్రవేశించి) మిత్రమా! వినోదా!

వినో—(పలుకకుండును)

షణ్ము—(బిగ్గరగా) మిత్రమా! వినోదా! వినోదా! పలుకవేమి?

వినో—(తలయెత్తిచూచి - ఎవ్వడా బికారి వెకిలినవ్వు నవ్వుచు) ఈ బికారికి నేను మిత్రుడనట! ఓహో! ఏమిమిత్రుడు! ఏమిమిత్రుడు! మా మంచిమిత్రుడు. వహ్వావహ్వా! ఏమివేషము! మహాయుగంధరునివేషము.

షణ్ము—అయ్యో! మిత్రమా! వినోదా! ఇంతలోననే, నన్ను మరచిపోయితివా! ఆహా! కాలమహిమ! దారిద్ర్యదశయందు రూపమునుగూడ మార్చివేయునుగదా! మిత్రమా! వినోదా! నేను నీ ప్రియమిత్రుడను షణ్ముఖుడనుగానా! కర్మవశమున నాకిట్టి గతి సంప్రాప్తించినది. మిత్రుడవుగనుక సిన్నాశ్రయించితిని. కష్టకాలమున మిత్రులుగదా! కాపాడువారు.

వినో—(కోపముతో లేచి) ఛీ ఛీ! మృషావాదీ! నీయట్టి బికారి నాకెన్నటికిని మిత్రుడుగాజాలడు. అధికప్రసంగమును గట్టిపెట్టి

పొమ్మనలకు ! లేనిచో నాకరుచే మెడబట్టి బయటకు గెంటిం తును. నాకడనా నీమాయానాటకప్రదర్శనము. (పండ్లుకొరుకుచు) బికారి. నాకు మిత్రుడట ! ఈ పాడుబికారి.

షణ్ము—(కోపముతో) ఓరీ ! విశ్వాసఘాతకా ! నీవంటి దుష్ట మిత్రులస్నేహమున నేగదా! నే నిట్లు బికారినయితిని! పాపాత్మా! నీ వెవ్వరివలన నింతటి భాగ్యవంతుడవైతివో యించుక యోచించి బుద్ధి దగ్గరబెట్టుకొని మాటలాడుము. ద్రోహీ ? నా సొమ్ముదిని నా రొమ్ముగుద్దెదవా ? ఏమీ నన్ను గెంటెదవుగా ? పలు గాకీ ! నన్నునీవు గెంటించునంతటివాడవైతివా ? నాదవ్యముచేత భోగభాగ్యము లనుభవించుచున్న నీ కింతటి పొగరెక్కెనదిగా.

వినో—(కోపముతో) ఛీ ! వదరుబోతా! నోరుమూయుము. పొమ్ము.

(మెడబట్టి త్రోసివేయ షణ్ముఖుడు క్రిందబడిపోవును).

షణ్ము—ఆహా ! దురహంకారా ! చివర కెంతపనిగావించితివి.

ఉ. మిత్రులరంచు మిమ్ము గృప ♦ మించగ జేరగదీసి యెంతయో
మైత్రిని మత్సమానముగ ♦ మన్నియు ప్రాణములిచ్చినట్టి మేల్
మిత్రిని కష్టకాలమున ♦ మీరలుజేయు సహాయమిద్దిగా
ధాత్రిని దుష్టమిత్రుల వి ♦ ధంబిదియా తెలిసెన్ దురాత్మకా.

పాపబుద్ధీ ! మిత్రులను నీవంటి మోసగాండ్రిల్లరును శత్రువులని చెప్పుటకావంతయు సందియముులేదు. కాకున్న యెడల

గీ. మిత్రులమటంచు నాతోడ ♦ మెలసికలసి
యెందరెందరో నాపైక ♦ మెంతొదినిరి
కష్టకాలంబునందు నా ♦ కడ్డునునన్ను
బిలచియును నాదరించు వా ♦ డిలనుగలడె ?

వినో—ఛీ! నోరుమూయుము. అట్లే పేలుచుగూర్చుంటివేని పండ్లూ డగొట్టి పంపెదను. మర్యాదగా లేచిపొమ్ము.

షణ్ము—ఓరీ ! ఛండాలుడా !

గీ. నీచ-విశ్వాసహీనులా ♦ నిన్నుఁబోలు
మిత్రసంఘంబుకన్న నీ ♦ ధాత్రిలోన
తనదు యజమాని సేవలో ♦ తనువువిడచు
గూర్మిమించంగ పెంపుడు ♦ కుక్క మేలు.

వినో:—ఛీ! దౌర్భాగ్యుడా! తిన్నగాపోయెదవా లేదా చెప్పుము.

షణ్ము—(కోపముతో) మిత్రద్రోహీ! నీ వెనుకటిజీవితమును మరచితివా! తులువా! యింతలోననే మరచిపోతివా! అల్పబుద్ధీ! నీ గతజీవితమును నలువురిలో బెట్టిన, నపుడు నీగతియేమగును! ప్రస్తుతము నీవనుభవించుచున్న ఈభోగము, ఈ గౌరవము, ఈ మర్యాద మంటిపాలుగాకుండునా! నీగుప్తచారిత్రప్రదర్శన మెల్లరకు నేవ బుట్టింపదా? (పండ్లుగొరుకుచు) పశువా! నీ-భార్య-ను.

వినో—(కంపించుచు) ఆ! ఆ! షణ్ముఖా - షణ్ముఖా - నన్నుక్షమింపుము - నా పూర్వోదంతమును వెల్లడిచేసి - నా గౌరవమును గంగపాలు గావింపకుము-

షణ్ము—మానను - మానను - బుద్ధిహీనుడా! నీపూర్వోదంతమును వెల్లడిచేయకమానను - మిత్రద్రోహిని, నిన్నుమన్నింపను. నీకు ప్రతీకారమదియే - నీకు ప్రతీకారమదియే.

వినో—వలదు - వలదు! మిత్రమా! మిత్రమా! నా ప్రార్థనవినుము. నాయవినీతిని మన్నింపుము.

షణ్ము—ఛీఛీ! గర్వోన్మత్తా! నీవు నాకు మిత్రుడవుగావు, శత్రుడవు, నిజమిత్రునిలక్షణ మిదియా? స్వార్థపరుడా! పువ్వులతో బూజించినమిత్రుని రాళ్ళతో గొట్టిన పాతకుని నిన్ను మన్నింపవలయునా! లేదులేదు. నిన్ను మన్నింపజాలను. నిన్ను మన్నించుటకు నా మనసొప్పుటలేదు. లోకముచే ఛీ ఛీ! యనిపించుకొని యగౌరవబాధావ్రణపరితాపమానసుడవై నా వలె వీధివీధికిని బిచ్చమెత్తుచు బికారిరూపమున నీవు దిరుగుట నా కనులారగాంచి నపుడుగాని, నా క్రోధాగ్ని చల్లారదు గావున, నిన్నిపుడు

మన్నింపజాలను. నీ పాపకృత్యములు ప్రపంచమునకు బయట
బెట్టెదను.

వినో—(తొట్రుపాటుతో) మిత్రమా! మిత్రమా-షణ్ముఖా-నాగౌర
వమును గాపాడుము-నా కొనర్చిన యపరాధమును మరచిపొమ్ము
నీపాదములబట్టి ప్రార్థించెదను (రెండుపాదములు బట్టుకొని)
షణ్ముఖా! నేను నీవాడను - ఈ యైశ్వర్యమంతయును నీది -
నీకేమికావలయునో నిరభ్యంతరముగా తీసికొనుము. నాగౌరవము
కాపాడిన నాకంతియేచాలు.

షణ్ము—ఛీఛీ! పశువా! దూరముగాతొలగుము. అవిధేయుడవగు
నీ సాయము నా కవసరమేలేదు. మిత్రద్రోహివైన నీవు బెట్టు
భోజనము విషతుల్యము. అనృతవాదివైన నీ వదనము దిలకించిన
రౌరవాది మహానరకము సంభవించును. (కాలితో శిరముపైదన్ని
చరచర నిష్క్రమించును.)

వినో—ఆ! ఆ! షణ్ముఖా! నిలునిలు-మిత్రమా! పోకుము!
పోకుము! (ముందునకు నడచివెళ్ళి రెండుచేతులతో శిరము బట్టు
కొని) అయ్యో! నేనెంతటి యక్రమకార్యమొనర్చితిని! అన్నము
బెట్టి యాదరించి, ఐశ్వర్యవంతునిగా నొనర్చిన మిత్రుని కాతిథ్య
మిచ్చి పూజించుటకు బదులుగా నవివేకుడనై పరుషభాషణములచే
బాధించితిని. హా! ఎంతపనిజరిగెను- (కుర్చీలోగూలబడి యించుక
యోచించి) ఆహా! నాచే పరాభవింపబడిన షణ్ముఖుడు కడుపు
మంటచే నా పూర్వోదంత మెల్లను తెలియబరచిన, నప్పుడు
నా గతియేమిగావలెను? నేనీయూర తలనెత్తుకొని తిరుగగలనా?
అన్నా! ఇపు డేమికర్తవ్యము? ఎటులైనను షణ్ముఖుని
బ్రార్థించి ప్రసన్నుని జేసికొనుటయే ముఖ్యకర్తవ్యము. నా
మర్యాద దక్కుట కింతకన్న మంచిమార్గము గనబడదు ఆల
సింపక షణ్ముఖుని నేనిపుడే గలసికొందునుగాక (చరచర నిష్క్ర
మించుచుండ తెరదిగును.)

## —♦ ద్వి తీ యా రం గ ము ♦—

(తెరలేచిన - మాధవరావు శయ్యాగృహమున శ్యామల కుర్చీపై గూర్చుని విచారించుచుండును.)

శ్యామ—ఆహా! విధాతా ! నీసంకల్పములెంత వికల్పములు.

గీ. పుడమి విద్వాంసునకు శుద్ధ ♦ మూర్ఖురాలు
కుమతి గయ్యాళి నాలిగా ♦ గూర్తువముల
చరిత, విద్వాంసురాలికే ♦ చవటమైన
పతిని విద్యావిహీనుని ♦ జతగగూర్చి
భూతలము ద్రిప్పుచుందు ♦ రీతివికృతి.

ఆహా! ఇది యాతయును దరిద్ర్యపేక్షచే నాతల్లిదండ్రి లొనర్చిన మోసము - కేవలమిది మోసముపైన జరిగిన పెండ్లిగాని, నా యిష్టానుసారమైన పెండ్లియా ! ఔరా! ఇదియెట్టి విచిత్ర సంఘటనము. ఘోర్తుఫారము నాలుగు సంవత్సరములు ఫేలైన వరుడా ? ఎఫ్-ఎ-ప్యాసైన వధువా ? నలువురిలోనను నగుబాట్లు దాంపత్యమా ? ఛీ ! ఛీ ! నా జీవితము నిష్ప్రయో జనము - నాయౌవన మడవిని గాయువెన్నెల (దుఃఖముతో) అయ్యో ! దుర్భరము ! ఇష్టములేని పెండ్లి - ఇష్టములేని వరుడు - ఇష్టములేని సంసారము విషతుల్యము (కన్నీరుగార్చుచు వెక్కి వెక్కి యేడ్చుచుండును.)

మాధవరావు—(ప్రవేశించి) హాలో మై డియ్యర్ లేడీ శ్యామలా ! ఏమిచేయుచుంటివి ? (శ్యామల మోముజూచి నివ్వెరపడి) ఆ ! ఇదియేమి ? శ్యామలా ! ఏడుచుకేడ్చుచుంటివి ?

శ్యామ—ఏందుల కేడ్చుచుంటినా ? నాప్రారబ్ధకర్మమునకు.

మాధ—కారణము ?

శ్యామ—నా పాపమిట్లు పండుటయే దీనికిగల కారణము.

మాధ—శ్యామలా ! ఎవ్వరిమూలమున నీకింతటి కష్టము కలిగినదో చెప్పుము - శ్యామలా ! చెప్పుము వానినిపుడే తప్పక శిక్షించెదను. (దగ్గరకువచ్చి చేయికట్టుకొనును.)

శ్యామ—(కోపముతో చేయివిదలించుకొని) ఎవ్వరికిమూలమున నాకిట్టి గతి సంభవించినదా ! మీ మూలమున నే, పరదారా సంగమాభిలాషులైన మీ మూలమున నే, విద్యా విహీనులైన మీమూలమున నే - ప్రస్తైయను పేర నాగళమునకురిత్రాడుబోసిన మీమూలమున నే - నన్ను విసిగింపకుడు - నా శరీరమునంటకుడు. నేనిపుడస్వస్థచిత్తనై యుంటిని.

మాధ—(చకితుడై) ఆ ! ఆ ! ఏమంటివి ? శ్యామలా ఏమంటివి ? నామూలమునా ! నీకీవిచారకారణము ? నేను నీకేమొగ్గు జేసితిని?

శ్యామ—(ఏడ్చుచు) ఔను! తప్పక మీమూలమున నే - శ్యామలకు భర్త నశిపించుకొనుచున్న దుష్ప్రవర్తకులైన మీమూలమున నే నాకిట్టి భరియింపరాని పరాభవము సమకూరినది- ఆ పరాభవాగ్ని నన్ను నిలువునదహించి వేయుచున్నది. అయ్యో ! సహస్రవృశ్చికము లొక్కసారి మీటినట్లు నాశరీరమంతయును భగ్గున మండి పోవుచున్నది - అహా నాయందు దయయుంచి మీరు నాయెదుట నుండక వెడలిపొండు.

మాధ—శ్యామలా ! డాక్టరును పిలువనంపెదను.

శ్యామ—వలదు ! వలదు ! మిమ్ము బ్రార్థించెదను. మీరుమాత్రమీ దినము నా యెదుటనుండక వెడలిపోయినచాలును.

మాధ—అట్లైనను - డాక్టరునుపంపెదను.

శ్యామ—అవసరములేదు - మీరిచ్చటినుండి వెళ్ళిపొండు- నే నించుక విశ్రాంతిగైకొందును - వెళ్ళుడు - ఊఁ ! వెళ్లుడు - అయ్యో ! మీ కింకను కదలరి దేమిపాపమువచ్చినది.

మాధ—(విషణ్ణవదనముతో) మంచిది. శ్యామలా ! గతమునకు చింతింపక నీవించుక విశ్రాంతిగైకొనుము. నేనిదే వెళ్లుచుంటిని. (నిష్క్రమించును.) (వేరొకవైపునుండి శకుంతల ప్రవేశించి) అన్నా ! ఎంత పొరపాటుపని చేసితివి ? సోదరీ ! శ్యామలా ! తప్పుతప్పు ! నీవింతటి విద్యావతివిగదా ! భర్తనిట్లు తృణీకరించుట భావ్యమా ! విద్యాధనమార్జించి, వివేకవతులమై -

ప్రపంచజ్ఞానమెఱింగిన మనబోంటి యువతీమణులే యిట్లొనర్చినచో
ఇంక నక్షరబ్రహ్మమునెఱుగని మూర్ఖసతులగతి యేమికావలెను ?

గీ. అరయ నాథుండు నిర్భాగ్యు ♦ డైనగాని
రూపహీనుండెగాని పెన్ ♦ రోగిగాని
జారుడగుగాని చదువని ♦ చవటగాని
సతికి పతిగద దైవమీ ♦ జగతిలోన.

సోదరీ ! శ్యామలా ! పెండ్లికిముందు వరుని గుణగణంబులు తెలిసికొని వివాహమాడవలయునేగాని, అంతయునైనవెనుక చింతించిన నేమి ప్రయోజనము ? చేసికొనినపిమ్మట నీమగడు నాకు వలదని త్రోసివేయుట మనవశమా.

శ్యామ—(శకుంతలను కౌగిలిడుకొని దుఃఖముతో) అయ్యో ! అక్కా ! అక్కా ! ఈపెండ్లి స్వయంవరముగాదు - ధనాశాపరులై నా తల్లిదండ్రులొనర్చిన బలవద్వివాహము. దొంగపెండ్లి.

శకుం—(ఆశ్చర్యముతో) ఆ ! ఏమిదీ ! నీకిష్టములేకయే పెండ్లిజేసిరా? ఔనౌను! అట్లు దొంగపోటిగా జేయకున్న నీ పెండ్లిపేమి - నీవు నన్ను పిలువకపోవుటయేల ? నేనురాక నీపెండ్లి జరుగుటయేమి - సత్యమిది తల్లిదండ్రులమోసమే-సందియములేదు. అహా !

చ. కడుపెడు కండలన్ సుతల ♦ గాంచినగూరిమి తల్లిదండ్రు లీ
వడువున ద్రవ్యమున్ గొనియు ♦ వారలగొంతులుగోయ నక్కటా
పడతుల కింకదిక్కెవరు ♦ భారతదేశమునందు నింక నీ
చెడుతలపుల్ నివారణము ♦ సేయునుగాక సుమామహేశ్వరుల్.

(శ్యామలను కౌగిలిడుకొని శిరము దువ్వుచు) సోదరీ !

శ్యామ—అక్కా !

శకుం—ముద్దుచెల్లెలా ! జరిగినదానికై పరితపించుట ప్రయోజనములేని పని - పతినిట్లు నిరాదరణమున జూచితివేని, భరియింపరాని లోకాపనిందకు గురిగావలసియుందువు - లోకమునకు వివేకదృష్టి మాంద్యము - చదువుకొనిన నాడువారెల్లరిట్లే నవనాగరికతావిలాసములకు లోనై, తమభర్తల నిట్లు చులకనగా జూతురని,

నిన్ను దూషించుటయేగాక, చదువుకొనిన మనబోటి మహిళా మండలినెల్లను దూషింతురు గావున, నే జెప్పిన చొప్పున ప్రవర్తింపుము - నీ భర్తను చెడుమార్గమునుండి సన్మార్గములోనికి ప్రవేశపెట్టుట నీలో నిమిడియున్న శాంతమే ప్రధానము - నీ మనసిచ్చి యాతని మానస్సును మరలింపుము - వేయేల -

గీ. చెల్లెలా నీమదిని చింత ♦ సేయబోకు
నీ మగని దైవమటుగొల్వు ♦ ప్రేమమీర
నమల సౌఖ్యంబు సత్కీర్తి ♦ నందగలవు
వసుధపై జానకీదేవి ♦ వలెనునీవు.

శ్యామ — అక్కా ! నన్ను మన్నింపుము. నీ హితోపదేశమున నా యవివేక మడంగినది. ఇకపై నీ యాజ్ఞానువర్తినై, పరమ భక్తి శ్రద్ధలతో పతిసేవజేసెదను; పార్వతీపరమేశ్వరులవలె నత్తమామలను పూజించెదను. నా దుర్నీతిని మన్నింపుమని యిపుడే నా పతిపాదములబడి క్షమాగ్పణ గోరుకొనెదను.

శకుం — మంచిది చెల్లెలా ! సంతసించితిని. రాబోవు శుక్రవారమునదయమెనిమిది గంటలకు నా తండ్రి, రాజారావునకును, నాకును, వివాహము సేయును. మా వివాహమునకు మీ వధూవరులు తప్పక రావలయునుసుమా.

శ్యామ — (నవ్వుచు శకుంతల మెడ కౌగలిడుకొని) అక్కా ! సంతోషము. ధన్యురాలవు. మీ వివాహమునకు నే కురుపురమును తప్పకవచ్చెదము.

శకుం — చెల్లెలా ! వచ్చుటయేగాదు - మా వధూవరులకు - మీవధూవరులు -

శ్యామ — ఔనౌను ! అభినందనపత్రికలు సమర్పించి, మాయానందమును వెల్లడించెదము. అంతియేగదా ! అక్కా ! రమ్ము మా యాతిథ్యమును గైకొనుము. నాప్రార్థనమును త్రోసివేయకుండునని నిన్ను వేడుకొనుచున్నదాన.

శకుం — మంచిది - చెల్లెలా నడువుము.

(యిరువురును డైలాగు పాట దుర్గా - చతురశ్ర)

శకుం—ప॥ వేడుకొనగవలెనా సోదరీ ॥వే॥

అ॥ వేడుకమీర । కోరికదీర ।

విందారగింతు ! మందగమనసను ॥వే॥

శ్యామ—ప॥ సోదరి నను దయతో జూతువు ॥సో॥

అ॥ మేదిని మైత్రిని । మించినవస్తువు ।

లేదుగదా పరికించిచూడగా ॥సో॥

శకుం—వేడుకొనగవలెనా సోదరీ ॥వే॥

వేడుకమీర । కోరికదీర

విందారగింతు ! మందగమనసను ॥వే॥

(ఇరువురు చేతులుగలుపుకొని నడచిపోవ తెరదిగును.)

---

—♦ తృతీయరంగము ♦—

[రాజవీధి - మునిసిపల్ బిల్ కలెక్టరుయొక్క పుస్తకముల గంప నెత్తిన బెట్టుకొని - షణ్ముఖుడు సైదులోనుండి ప్రవేశము].

పాట—నాదనామక్రియ.

ప॥ పేకాటకుఫలమిదియా దైవమ ।

పేకాటకుఫలమిదియా చివరకు॥ పే॥

అ॥ రేలుబవళ్లును । నిదురనుమానియు ।

వేలుపందెమిడి । మేలుగనాడిన॥ పే॥

చ॥ ఆనందమునకు । నాటపట్టుచు

పూని దైవముగ । బూజించినయా॥ పే॥

ఆహా ! పేకాటలో నెంతమహిమలోగలదు;

సీ. నిరతంబునాడించి ♦ నిర్భాగ్యులను జేయ

కారణంబగును పే ♦ కాటగాదె

లక్షాధిపతులను ♦ భిక్షార్థులనుగాగ

గావింపగలుగు పే ♦ కాటగాదె

తండ్రిజచ్చినసరే ♦ తనదుస్థానమునుండి
కదలనీయనిజె పే ♦ కాటగాదె
తల్లితద్దినమున్న ♦ పరువాతవత్తు నా
యాటబోననుట పే ♦ కాటగాదె

గీ. వేలు దుర్వ్యసనములకు ♦ మూలమేది
మంచివారికి పిచ్చి నె ♦ త్తించునేది
ఆటపేకాట శనిదేవ ♦ తైన పేక
నాడమానుడు యికనైన ♦ నన్నలార,

చదువుకొనక సోమరులై దురభ్యాసములకు లోనైనవారికి నావలె గంపలుమోయు గతి తప్పదు. ఓ భారతీయ సోదరులారా! చూచితిరా.

గీ. విలువదుస్తులుదాల్చియే ♦ వేళనేని
కారులోగాని, బయటకు గదలనట్టి
మోహనాంగుని మృదువైన ♦ మూర్ధమునను
తాండవంబాడుచుండె ♦ నీ తట్టయిపుడు.

బిల్‌కలెక్టరు—(ప్రవేశించి కోపముతో) ఓరీ! మూర్ఖుడా! నీకు బుద్ధిలేదా యేమి? దున్నపోతువలెనుండియును, గంప మోయలేక వెనుకబడుచుంటివేమి ? చాలు చాలు ! త్వరితముగరమ్ము. ఆఫీసు కట్టివేయువేళగూడనైనది. సరిసరి నాకు మంచి చురుకైనవాడవే దొరకితివే !

షణ్ము—అయ్యా! చిత్తము. తప్పు క్షమింపుడు. ఇదే వచ్చుచుంటిని (బిల్‌కలెక్టరువెనుకనే నిష్క్రమించును.)

---

—♦ చతుర్థరంగము ♦—

(శ్యామల మాధవరావులు సోఫాపై నొకరికొకరానుకొని కూర్చుండగా తెరలేచును )

శ్యామ—మహాశయా ! మీరు విద్యాపరిపూర్ణులు గాకున్నను, నాకు దైవసములని, ఎఫ్-ఏ-ప్యాసైన నేనెరుంగని విషయముగాదు-కాని

నాయందు దయయుంచి మీ రిప్పుడైనను కష్టించి విద్యాభి వృద్ధికై పాటుబడుడు. మీకు నేను ట్యూషను (పాఠము) జెప్పె దను. భార్య ఎఫ్-ఏ-ప్యాసయ్యెను. - భర్తఘోర్తుఫారము నాలుగు సంవత్సరము ఫేలయ్యెనని - లోకులు పరిహసించుచు పలుకు నిందావాక్యములు వినుచు మీ యవమానమును నేను సహింప జాలను. అదిగాక.

గీ॥ ధనముగలదంచు మీకు నా ♦ తల్లిదండ్రి
పెండ్లిజేయంగ యత్నించ ♦ విద్యలేని
వరుడు వలదంచు మొదటనే ♦ బలికియుంటి
కాని విధియాజ్ఞ యిటులుండు ♦ కారణమున.

గీ. తల్లిదండ్రుల దారిద్ర్యత ♦ తను నెరింగి
వారిబుణము నుదీర్ప వి ♦ వాహమైతి
నరయ ! విద్యావిహీనుల ♦ రైనమీకు
నాథ ! నాచింతయేరీతి ♦ బోధపడును?

మీ యర్ధాంగినగు నా విన్నపమాలించి, విద్యాధన మార్జింపుడు ! దాన మీకును, నాకును వెలలేని గౌరవముగలుగును. చూడుడు. మీ మిత్రుడైన రాజారావునికు పేదవాడైనను బి.ఏ., ప్యాసయ్యెను. మంచి బుద్ధివంతుడని, ఆనందరావుగారు తమపుత్రికయు నా మిత్రు రాలగు శకుంతలనిచ్చి పెండ్లిజేయు సంకల్పించెను.
ఆవిడ - ఎఫ్ - ఏ - ఆతడు - బి - ఏ - అట్లుండవలెను దాంపత్య మసిన - ప్రాణేశ్వరా-మనమిదుపురమును శకుంతలా రాజారావుల వివాహమునకేగి యా వినోదములతో సగపాలు పంచుకొనవల యును. నా మిత్రురాలగు శకుంతల స్వయముగావచ్చి పిలచివెళ్ళి నది - మా యుగపురతనువులు భేదమేగాని. ప్రాణము ఒక్కటియే. ఆశకుంతలయేగదా నా యీమార్పునకు మార్గదర్శిని - మీయున్న విధ్యాధికులను గవించుకొనుట నాచేతిలోనిపనియని,ఆమె నే నాకు సద్బోధ గావించినది - వేయేల - జీవితాధిపతీ ! విద్యాధనము న కేధనము సాటివచ్చును ?

పాట—కాఫి—ఆది.

ప॥ ధరణిని విద్యాధనమే ధనమగు ।
తలచిచూడ ధనమిదు నేజ్ఞానము ॥ధ॥
అ॥ చోరులకును స్వాధీనముగానిది ।
సూరిజనులు మనములను మెచ్చునది ॥ధ॥
చ॥ సభలయందు ప్రఖ్యాతిగూర్చునది ।
సద్గుణంబులను బ్రసాదించునది ।
విభవోద్యోగంబులకు మూలమయి ।
విమలయశము దిక్తటులనింపునది ॥ధ॥

ప్రాణేశ్వరా! మీకు నేను జెప్పదగినదానను గాను, కాకున్నను; మీశరీరమే నాశరీరము. మీ ప్రాణమే నాప్రాణము గావున - మీ వర్తనముల సరిజేసి, మిమ్ము మంచిమార్గమున బ్రవేశపెట్టి విద్యాధికులను గావించుకొనుట నర్థాంగినగు నా విధ్యుక్త ధర్మమై యున్నయది.

సూంధ—శ్యామలా! విద్యావతివగు నీ సాంగత్యము నజేసి, నాయజ్ఞానాంధకారము పటాపంచలై పోయినది. నీ హితోపదేశము నాకు గురూపదేశమువలె జ్ఞానోదయమును గలుగజేసినది. ఇంకపై సుగుణవతివగు నీ యాజ్ఞానుసారము ప్రవర్తించెదను. ప్రాణేశ్వరీ!

గీ. విమల విద్యావతులెగాక ♦ నమలమతులు
ముదిత! నీయట్టిభార్యల ♦ మూలకమున,
మూర్ఖులును, పాపమతులును, నా ♦ బోటిపతులు
బాగుపడుదురు యింక నీ ♦ భరతభూమి.

సుందరీ! వేయేల! త్రికరణశుద్ధిగా జెప్పుచుంటిని.

గీ. భర్తనై నీకుపూజల ♦ బడయువాడ
మిత్రునివిధంబునీతోడ ♦ మెలగువాడ
శిష్యుడనునౌచు సేవల ♦ జేయువాడ
గురుడనై నీకు సేవల ♦ గొనెదవాడ.

(భార్యశిరము నిమురుచు) కాంతా! నుతసమమ్మెవా?

శ్యామ—నాథా ! సంతోషము ! ఇపుడుగదా ! నేను ధన్యురాలను. ఆహా ! ఏమి నా యదృష్టము ! బాగుబాగు.

గీ. ఎన్నరానట్టికష్టంబు ♦ లెన్నొ ఒడియు
కాంతు నీకీర్తిసేయగా ♦ గలిగినాను
పతిగృహామృతవీక్షణల్ ♦ బడసినపుడె
యతివ జన్మంబు ధన్యంబు ♦ నగుటనాథ.

పాట—ఆది—దుర్గా.

ప॥ ఆనంద మొదవెనుగా నాథా బ్రి
హ్మానందమయ్యెనుగా నాథా ।ఆ॥
అ॥ మానిని పతి గుణ । మాన్యుడునైనచో
దేనికి కనుగణు । తింపగస్వర్గము ॥ఆ॥
చ॥ కాంతకునాథుడె । గదదైవంబగు
నింతయేలనే । నిక ధన్యనుభళి ॥ఆ॥

సీ. విద్వాంసుడును మేటి ♦ విజ్ఞానిపతిగల్గు
పొలతికి యిక దైవ ♦ పూజలేల ?
అన్యచిత్తముగాక ♦ నధిపుండు ప్రేమించు
కాంతామణికి వేరు ♦ చింతలేల ?
వేడ్కతో తనజంట ♦ వీడి యుండని భర్త
గలిగినసతికి మో ♦ క్షం బదేల ?
సమముగా తన భర్త ♦ స్వాతంత్ర్యమిచ్చిన
సాధ్వికినింక భూ ♦ షణములేల ?
గీ. ఆదరంబున విభుడ ధ ♦ రామృతమిడ
కడతికీ పృథ్వినమృత ♦ పానమేల ?
అన్ని విధములనేను బు ♦ ణ్యాత్మనైతి
మన్మనోహర ! యికవేయి ♦ మాటలేల ?
(ఇద్దరును కౌగిలించుకొనుచుండ తెరదిగును.)

## —♦ పంచమరంగము ♦—

(ఆనందరావు కుర్చీపై కూర్చుండియుండ-రాజారావు-శకుంతల చేరియొకప్రక్క నిలచియుండ తెరలేచును.)

రాజా } ఆనందరావు పాదములకు నమస్కరింతురు.
శకుం }

ఆనం—(యిరువురను లేవదీసి) సంతోషము. నూతన వధూవరులు సత్సంతానమును బడసి, మీ యుభయ వంశముల నుద్ధరింపుడు - బిడ్డలారా మీదంపతులిర్వురు మాదంపతులకు చెరియొక ప్రాణము గాని వేరుగాదు. తల్లీ! శకుంతలా! విద్యావతివి. నీకు చెప్పవలసిన పనియేలేదు. కాని, చిన్నదానవు గనుక చెప్పుచుంటిని. రాజారావు నీకిపుడు పతి - నీవాతనిని దైవమురీతి సేవింపవలయును లోకువ లోనివాడని నిరసనభావమున జూడవలదుసుమా!

శకుం—తండ్రీ! మీపుత్రికనుగానా? పసిండి కొంతిబాలనా?

ఆనం—(శిరము దువ్వుచు కౌగలించుకొని) అమ్మా! చెప్పవలసిన ధర్మము గనుక చెప్పితిని గాని, గుణనిధివగు నిన్ను నేనెరుంగనా! (రాజారావునుజూచి) రాజారావు! శకుంతల నీయర్ధాంగము. నీ ప్రాణము నకు ప్రాణము - నీవు విద్యా వివేకములుగలవాడవనియే-భాగ్యమును పాటింపక - ఈ యమూల్యరత్నమును నీకొసంగితిని - రత్నమునెట్లు భద్రముగ గాపాడుకొనవలయునో నీకు తెలియును గదా! నేనిక జెప్పనేల?

రాజా—చిత్తము. అనుగ్రహింపబడితిని. భవదీయాజ్ఞానువర్తిని. మహాశయా! తమ పరిపూర్ణ కరుణా కటాక్షమేగదా నాయభివృద్ధికి మూలకారణము. ధన్యుడను, కృతజ్ఞుడను.

గీ. పేదబాలుడనని మంచి ♦ యాదరమున
దీసి యభివృద్ధిలోనికి ♦ దెచ్చినారు
చివరకిటు పుత్రికనుబెండ్లి ♦ జేసినారు
మీరొనర్చిన యుపకృతి ♦ లోరవంత
దీర్చనేర్తునె ఋణమును ♦ దీర్తునింతె.

గీ. ఇన్నివచియింపగానేల ♦ నీధ త్రి
తల్లికంటెను ననుగన్న ♦ తండ్రికంటె
గురునికంటెను మేల్మిత్రు ♦ వగునికంటె
దయనబ్రోచినమీమేటి ♦ ధర్మగుణము
మరువనేర్తునె వేయి జ ♦ న్మములకైన.

ఆనం—రాజారావు ! ఇంకపై మీ దంపతులిరువురును మా యా వదాస్తికిని సర్వాధికారులు. మా దంపతుల కింతకంటెను గావలసిన మహాభాగ్యమేమిగలదు! అమ్మా! శకుంతలా! ఇదియే మా యాశీస్సు.

క కూరిమిమీరగలక్ష్మీ
నారాయణులనుసతంబు ♦ నమ్మిగొలుచుచున్
పేరిమిదీనులసాకుచు
ధారుణివర్ధిలుడునూత్న ♦ దంపతులారా.

(ఇరువురి శిరముల కరములుంచ - నిరువురును నమస్కరించుచుండ తెరదిగును).

## ప్ర క ట న.

ఈ బీదవిద్యార్థి, బి.ఏ., నాటకము ఏలూరు శ్రీ నరసింహా రాయన్యాధియేటర్సునాటకసమాజమువారు త్వరలో ఏలూరు హిందుయువజనసంఘములో ప్రదర్శింపనున్నారు.



# బీదవిద్యార్థి, బి. ఏ.

## పంచమాంకము.

### ప్రథమ రంగము.

(డిస్ట్రిక్టుమున్సబుకోర్టు - మున్సబు రాజారావు - అగ్రాసనమున గూర్చుని వ్రాయుచుండును - హెడ్‌గుమాస్తా - మున్సబుగారి యెదుట నొక ప్రక్కగానున్న కుర్చీపై గూర్చుని, టేబిలుపైనున్న కాగితములు తిరుగవేయుచుండును - వకీలు గంగారావు - వకీలు భీమారావు - తాను టేబిలునకు చెరియొకవైపునను గూర్చుండి - పుస్తకములు తిరుగవేయుచుందురు. ఢలాయతు చేతులుగట్టుకొని నిలచియుండ తెరలేచును.)

హెడ్‌గుమాస్తా—వాది రామారావు.

ఢలాయతు—చిత్తము! చిత్తము! (గట్టిగా) వాది రామారావు - వాది రామారావు - వాది రామారావు.

రామారావు—(ప్రవేశించి) హాజర్ (మున్సబునకు నమస్కరించును)

హెడ్‌గుమాస్తా—ప్రతివాది షణ్ముఖం

ఢలాయతు—ప్రతివాది షణ్ముఖం! ప్రతివాది షణ్ముఖం!

షణ్ము—(ప్రవేశించి, హాజర్ (మున్సబునకు నమస్కరించి, మున్సబు వైపుజూచి చకితుడై రెండడుగులు వెనుకకువేసి) ఓహో! నీవా? రాజారావు! నీవేనా! డిస్ట్రిక్టుమున్సబువు?

ఢలాయితు—ఏమాపిచ్చిపిచ్చి మాటలు! అప్రస్తుతప్రసంగమును గట్టిపెట్టుము. ఇది న్యాయస్థానముగాని, ఇష్టమువచ్చినట్లు మాటాడుటకు మీా యిల్లుగాదు. జాగ్రత.

షణ్ము—అంతటితో గట్టిపెట్టుము ఆతడు నా మిత్రుడు.

ఫలాయతు—అధిక ప్రసంగము జేసినవారు బయటకు గెంటబడుదురను సంగతి మీకు దెలియదా ! మాటలాడకుడు.

మున్నబురాజా రావు—ఫలాయత్ ! నీ వూరకుండుము. ఆతడు నా మిత్రుడు.

ఫలాయతు—చిత్తము.

షణ్ము—ఆహా ! ఇదియేమి-విచిత్రము-భగవల్లీల లగోచరములుగదా ! బీదవిద్యార్థి బి.ఏ., రాజా రావు-డిస్ట్రిక్టుమున్నబుపదవినందుటయా -

మున్నబు రాజా రావు—ఔను ! మిత్రమా ! మీ యందరి దయవలననే నాకింతటిపదవి లభించినది. విభవమబ్బినదని విఱ్ఱవీగువాడనుగాను. సదా మీ కెల్లరకును నేను విధేయుడనే.

షణ్ము—సంతోషము - సంతోషము - సంతోషము.

మున్నబురాజా రావు—(రామా రావునుజూచి) అయ్యా! రామా రావుగారు, మీకీ షణ్ముఖ మీయవలసిన పైకమెంత ?

రామా రావు—చిత్తము. నా కాఫీహోటలుబాకీ- రెండువందలు.

భీమా రావు—(లేచి నిలువబడి బల్ల గుద్దుచు) నోనోనోనో ! అది యంతయును వట్టియబద్ధము - అక్రమము.

రంగా రావు—(లేచినిలువబడి గట్టిగా నరచుచు) బొంకినలాభము లేదు. ఇవిగో కాతాబుక్కులు - పద్దులు - న్యాయాధిపతులు చిత్తగింపవచ్చును. (కంగారుతో పుస్తకములు తీయబోవ, నవి క్రిందబడ, ప్రేక్షకులు గొల్లుమందురు. వకీలు మరల నాపుస్తకములదీసి మున్నబుగారి టేబిలుపై బెట్టి) అయ్యా ! వీటిని తాము పరిశీలించి చూడవచ్చును.

భీమా—అయ్యా ! ఆవ్రాతలన్నియును, కల్పితములు-అట్టి అవిశ్వాసనీయములగు తప్పుడు వ్రాతలను కోర్టువారు విశ్వసింపరాదు - వాడి పట్టురకం ఫోర్జరీయని పట్టణమంతయును పేరుపొందినవాడు.

గంగారావు— అవియన్నియును గిట్టనివారు పుట్టించిన యపనిందలు - అయ్యా! కోర్టువారిదియొకటిమాత్రము చక్కగా గ్రహింపవలయును - మా క్లయింటువంటి గౌరవనీయుడు ప్రపంచములో నిదివరకెప్పుడును పుట్టియుండలేదు - ఇప్పుడు పుట్టియుండ లేడు - ఇకముందు పుట్టబోడు - ఇందలి న్యాయము విచారించి కోర్టువారు మాకు డిక్రీ యివ్వగలరని నమ్ముచున్నాను.

రామారావు—యస్! యస్!

భీమా—నోనో! ఆపద్దులన్నియును సృష్టింపబడినవి - ఆసంతకములు ప్రతివాదిచేసినవికావు - కావలసినయెడల న్యాయమూర్తులు మా క్లయింటుచేవ్రాలును - ఆపద్దులలోనున్న చేవ్రాళ్ళను బాగుగా పరిశీలించి, అక్రమముగా కేసుబెట్టి జమీందారుకుటుంబమునకు జెందిన మా క్లయింటును కోర్టునకీడ్చినందులకై పరువునష్టము క్రింద పదివేలరూపాయలు ప్రతివాదికి వాదియిచ్చునట్లును, ఫోర్జరీ చేసినందులకై వాదిని కారాగారనివాసుని గావించుటకును, కోర్టువారిని నేను గోరుచున్నాడను.

మున్సబురాజారావు— అయ్యా! ఎవ్వరును మాటలాడవలదు. (షణ్ముఖునిజూచి) మిత్రమా! షణ్ముఖం! నీ వీయనకు రెండు వందలరూపాయలీయవలసినది సత్యమేయగునా?

షణ్ము—ఔను! ఈయవలసినమాట నిజమేగాని, నాకడ నిప్పుడొక రాగిదమ్మిడియైనను లేదు. కట్టుకొన సరియగుబట్టలు లేనేలేవు సరిగదా! తినుటకు తిండికూడా లేక మలమల మాడుచుంటిని. మిత్రమా! నాయీ బికారివేషమును జూచితివిగదా?

మున్సబురాజారావు—మిత్రమా! షణ్ముఖం! చింతింపకుము. యిక నీకేలోటునులేదు (రామారావునుజూచి) రామారావుగారూ! మీ రెండువందలకును చెక్కు వ్రాసియిచ్చెదను (చెక్కు వ్రాసియిచ్చి) ఇకమీరు వెళ్ళవచ్చును.

రామారావు—చిత్తము. నా పైకము నా కందజేసినందులకు మీకు తెలియును నా కృతజ్ఞతాపూర్వక వందనములు. అయ్యా ! నాకిక సెలవు (నమస్కరించి నిష్క్రమించును).

మున్సబురాజారావు—(హెడ్ గుమాస్తానుజూచి) అయ్యా ! ఈ పూట కేసులన్నియును మీరు వాయిదా వేయుడు.

హెడ్ గుమస్తా—అయ్యా ! చిత్తము ! అట్లేగావించెదను.

మున్సబురాజారావు—ఫలాయత్ ! డ్రైవరును కారు సిద్ధముజేసి యుంచుమని జెప్పిరమ్ము.

ఫలాయితు—చిత్తము. (నమస్కరించి నిష్క్రమించును.)

మున్సబు రాజారావు—మిస్త్రీమా షణ్ముఖం ! ఇంటివద్ద మంచిపెద్దలు సావకాశముగా మాటలాడుకొందము నడువుము. (ఆసనమునుండి లేచుచుండ - ప్లీడరు - గుమస్తా - లేచి నిలుచుండ- తెరదిగును.)

---

## — ద్వితీయరంగము —

టౌనుహాలు - ఉపన్యాసవేదిక - వెంకటరావు గారధ్యక్షపీఠమలంకరింప - రాజారావు - శకుంతల - మాధవరావు - శ్యామల షణ్ముఖుడు మరికొందరు నిలచియుండ తెరలేచును - అందరును బోలో భారతమాత సత్యదేవతకు జై - బోలో అధ్యక్షమహాశయునకు జై - బోలో "బీదవిద్యార్థి, బి ఏ - డిస్ట్రిక్టుమున్సబు రాజారావుగారికి జై అందురు.

వెంక—(పీఠమునుండిలేచి) మహాశయులారా ! నేటి సభ విద్యావిషయమునుగురించి సమావేశమైనది - విద్యావిషయికనాట్యమండలివారు నన్నధ్యక్షుని గావించినందులకు వారికేగాక నేడు మీకెల్లరకును నా కృతజ్ఞతాపూర్వక వందనములు - ఈ సమాజముఖ్యోద్దేశ మేమనిన స్త్రీపురుషులెల్లరును విద్యాధనోపార్జితులుగావలయుననియే - విద్యనేర్వక విజ్ఞానదూరుడగుటచేతనేగదా ! జమీందారు కుటుంబమునకు జెందిన షణ్ముఖుడు దుర్వ్యసనములజిక్కి తన యావదాస్తియును పాడొనరించుకొనుటకు హేతువైనది -

ధనికునిపుత్రుడను నేనేల చదువవలయునను గర్వముతోడ విద్యా విముఖుడైన నా కుమారుడు మాధవరావు వివాహముపట్ల మేము పడిన పాట్లు మీరెల్లరెరింగినవియే యగును. విద్యావతియగుటచే శ్యామల తన పతిని సన్మార్గప్రవర్తకునిగావించుటయేగాక విద్యాధికునిగూడ జేసినదని చెప్పుటలో స్వాతిశయముగాదు - నిరుపేదయైనను కష్టపడి చదువుకొని పదువురకును తలలోని నాలుక పోలిక ప్రవర్తించిన, రాజారావు చివరకు పట్టభద్రుడగుటయే గాక, వకీలు ఆనందరావుగారి కరుణాకటాక్షమునకు పాత్రుడై విద్యావతియగు శకుంతలను జేపట్టి, డిస్ట్రిక్టు మున్సబుపదవినంది మీ యందరి యాశీర్వాదమునకు పాత్రుడైనాడు - కావున భారత సోదర సోదరీమణులెల్లరింకపై, విద్యాజనని, సర్వదా పూజింతురుగాక. (నమస్కరించి కూర్చుండ సభికులెల్లరును కరతాళధ్వనులు గావించి - అధ్యక్షునకు జయజయ శబ్దంబులజేతురు.)

రాజా.—(చేతులుజోడించి) అధ్యక్ష మహాశయా! వందనములు. (సభికులజూచి) సోదర, సోదరీమణులారా! మీయందరికిని మా సమాజముతరపున నా వందనములు. కులతారతమ్యములేక నన్ని కులములవారును, స్త్రీపురుషులను భేదములేక, ప్రకృతిలో గలిగిన ప్రతివ్యక్తియును ముఖ్యముగా విద్య నేర్చితీరవలసినదే. విద్యాభివృద్ధి కేవల ముద్యోగములు సంపాదించుకొనుటకే గాక విజ్ఞానోదయమును గలుగజేసి - అజ్ఞానాంధకార తమంబంతయును పటాపంచలుగావించి - దేశకాలపాత్రంబులు కన్నులయెదుటబెట్టి హీనుల చెంతజేర్చి - సంఘులోపములను - రాజకీయములను - వివిధ విషయములును - మేధాస్థితముగావించి - విమర్శిత మొనర్చి - స్త్రీ పురుషులకు చక్కని నీతిమార్గమును జూపి దేశాభ్యుదయ కారణమగును - విద్య దుర్మార్గులను సన్మార్గులగావించును - మూర్ఖులను వివేకులనుజేయును. పతితులను పావనుల నొనర్చును. వేయేల విద్య చక్రవర్తిమొదలు సామాన్య భటునివఱకు శిరోధార్యము. పట్టమహిషికేగాక - పరిచారికకుసైతము విద్య పూజార్హమైన

భూషణమే యగును - అదియునుగాక - ఏనాడు మన భారతదేశ మన నైకమత్య మేకరూపము దాల్చునో - ఏనాడు స్త్రీపురుషులకు సమాన స్వాతంత్ర్యము సమకూరునో - ఏనాడంటుదోషమను మహాపిశాచ మడవులబడి పరువిడిపోవునో - ఏనాడు స్త్రీ పురుషు లెల్లరును విద్యాధికు లయ్యెదరో - ఏనాడు జంతువధావిధానము సమసిపోవునో - మద్యపానాది మత్తుపదార్థములు సేవించుట నిషేధింపబడునో - ఏనాడు బాల్యవివాహము లనుగంట నశించిపోవునో ఆనాడే మన భారతదేశము బాగుపడును. ఆనాడే దేశమాత పవిత్రకర పద్మముల జిక్కుకొనిన పరదాస్య శృంఖలములు విడివడి ప్రేమముమీర మనల నాశీర్వదించును - ఆనాడే లోకకల్యాణము సమకూరును - మహాత్ములారా - మీదయవలన నీనాటకము నిర్విఘ్నముగా నెరవేరినది. మీ యాశీర్వాదబలము మమ్ము నిరంతరము కాపాడుచుండ నింకమాకు గావలసినదేమి? అయిన నిట్లగుగాక.

(ప్రజలెల్లరును కరతాళధ్వనులు జేయుచు - బీదవిద్యార్థి బి.ఏ. డిస్ట్రిక్టుమునసబు రాజారావుగారికి జై యనుచు జయజయ శబ్దంబుల జేయుచు పుష్పముల జల్లుదురు)

రాజా — సీ. రైతుక్షేమము గోరి ♦ రాష్ట్రము లేలెడు
బుద్ధిభూపతులకు ♦ బుట్టుగాక
ఉద్యోగమనసుంత ♦ యును గర్వమందక
సధికార్లు ప్రజల మే ♦ లరయుగాక

మాధ — విద్యాభివృద్ధికే ♦ వేళ బాయనిగూర్మి
స్త్రీలుపురుషులు కృషి ♦ జేయుగాక
ఊరూరు దిరిగి సం ♦ చారంబునెల్లరు
చదువుకొండనుచు చా ♦ టెదరు గాక

పద్మ — చదువుసంధ్యలులేని ♦ చపటకునావలె
గంపలన్ మోసెడి ♦ గతియెగాక

ధనమెంతయున్న వి ♦ ద్యాధనంబందని
వాడుపూజార్హుండు ♦ గాడుగాక

శకుం—నెలత యెంతవిద్య ♦ నేర్చిన తన నాథు
దైవసమానుగా ♦ దలచుగాక

శ్యామ—చదివినందుకు మెచ్చి ♦ సాధ్వియై భువిలోన
చెలువ సత్కీర్తి నార్జించుగాక

శకుం—గీ. కాంతలకు పృథ్వి చదువు ము ♦ ఖ్యంబుగాగ
వినయ విద్యాభివృద్ధి గా ♦ వింత్రుగాక

శ్యామ— విద్య విజ్ఞాననేత్రంబు ♦ విమలయశము
గూర్చునది యెంచి సతులు గై ♦ కొందురుగాక.

అందరునుగలసిపాట - బ్యాండ్ ట్యూన్.

ప॥ విద్యాజననీ జైజై । విద్యాజననీ ।
విమలచరిత భారతమాత ॥వి॥

అ॥ ఎల్లవిద్యలొసగెడి మా । తల్లివిగద రత్నగర్భ ।
యెల్ల లోకముల నరింతు వెంతయు క్షమ పావననామ ।

మి॥ ముల్లోకములకు శ్రేయము । తల్లీ నీ యోర్పుగుణము
చెల్లరెసిను భక్తితోడ । సేవింతుము నిరతంబును ॥వి॥

చ॥ సత్యభాషిణి శాంతరూపిణి । సదయహృదయి జనని పాహి ।
పతివ్రతామొదలు నిన్ను । బ్రస్తుతింపఁ జెందెదము

మి॥ సత్యస్వరూపిణి సాధుపరిపాలని ।
సకల జగన్మాత సంకల్పఫలదాత ।
నిత్యకల్యాణి నమో నిగమసంచారిణీ ।
నిఖిల భూతధాత్రి । నీకిదె జయమంగళము ॥వి॥

(బోలో శ్రీ రాజా రామచంద్ర మహారాజ్ కీ జై - బోలో భారత మాత సత్యదేవతాకీ జై - అని జయజయ ధ్వనులు సేయుచు కరతాళధ్వని లొనర్చుచుండ తెరదించును)



సమాప్తము.

# కవితాపోషకులు.



1 నంబూరి విశ్వనాథశ్రేష్ఠిగారు-శికింద్రాబాదు

2 అనుముకొండ సత్యనారాయణనాయుడుగారు, భీమార్జున గర్వభంగము, వితంతు విజయాదినాటకకృతిపతి - హైదరాబాద మింటుక్యాషియరు - విద్వజ్జనపోషకులు.

3 కంచునూరి నర్సాగౌడుగారు, వీరి పుత్రులు-లింగయ్యగారు, రామస్వామిగారు, ఆంజనేయజనన నాటకకృతిపతి-నైజాము, కామారెడ్డితాలూకా-తుజాలపురము ధర్మాత్ములు.

4 శ్రీ మార్కండేయ శివచరిత్ర హరికథా ముద్రణార్థప్రదాతలు మద్యాహ్నపు నరసింహస్వామిగారు-వీరి యగ్రజులు దురగయ్యగారి కుమారులు, సుబ్బారావుగారు-ఏలూరు.

5 ఏనుగ రంగయ్యగారి కుమారులు రామారావుగారు-ఏలూరు.

6 బ్ర॥ శ్రీ చెన్నోజు రమణాచార్యులుగారు-సికింద్రాబాద బోయినపల్లి

7 గొడిశెల జానమ్మ లక్ష్మన్నగారి ద్వితీయ కుమారులు, గవరయ్యగారు-సికింద్రాబాద-బోయినపల్లి.

8 కొండా వీరయ్య, బుక్కుసెల్లరువారు-శికింద్రాబాద

9 చల్లారి నారాయణగారు-హరనాథ టైలరింగ్ హోమ్-ఏలూరు.

10 పోలిశెట్టి నరసయ్యగారు-ఏలూరు.

11 అడపా అప్పారావుగారు-ఏలూరు.

12 నరహరిసెట్టి సత్యనారాయణగారు-ఏలూరు.

13 పొట్టి సుబ్బారావుగారు-ఏలూరు.

14 దారపురెడ్డి రామారావుగారు-మహాదేవపల్లి.

15 సింగలూరి రాజారావునాయుడుగారు-ఏలూరు.

16 నప్పా వీరరాఘవరావుగారు-ఏలూరు

17 సింగలూరి కృష్ణారావుగారు-ఏలూరు

18 వాడపల్లి తిరుమలరాయుడుగారు-ఏలూరు.

19 యడ్లపల్లి నారాయణమూర్తిగారు-ఏలూరు.

20 వాడపల్లి శ్రీకృష్ణభగవానులుగారు-మహాదేవపల్లి.

21 రెడ్డి చిరంజీవిరావుగారు-పత్తేబాద.

22 దుగ్గిరాల సుబ్బారావుగారు-ఏలూరు.

23 నీలం శేషయ్యగారు, వర్క్-షాపు-కటకపూరు.

24 గరిగిపాటి తాతయ్యగారు, వర్క్-షాపు-కటకపూరు.

25 దేవరపల్లి సూర్యనారాయణమూర్తిగారు,
సుప్రసిద్ధవర్తకులు-మునిసిపల్ కౌన్సిలరు-కాకినాడ.

26 అనసూరి సూరన్నగారు, వీరితమ్ములు సత్యనారాయణగారు,
శ్రీ కౌతాపు సత్యదేవతా పాదసేవకులు-కాకినాడ.

27 మద్దుల శ్రీరాములుగారి పుత్రులు నాగేశ్వరరావుగారు-ఏలూరు.

28 సలాది రంగయ్యగారి పుత్రులు, సుబ్బారావుగారు-ఏలూరు.

29 సింగులూరి వెంకటరత్నంగారు-ఏలూరు.

30 డాక్టరు,సాలన సత్యనారాయణగారు. యం. బి. బి. యస్-ఏలూరు.

31 నదస్తుల నరసింగరావుగారు-ఏలూరు.

32 తరంగవిద్వాన్-అష్టపది-ప్రభాత సేవాగాన ధురంధర-హరికథా సుధాకర-బ్రహ్మశ్రీ నాదూరి విశ్వనాథభాగవతారుగారు-బందరు.

33 కథకవాచస్పతి-ప్రౌఢకవితావిలాస-భారతకథా నిర్మాత బ్రహ్మశ్రీ పరిమి సుబ్రహ్మణ్య భాగవతారుగారు-పోతునూరు.

34 హరికథాకంఠీరవ-సరసకవి-సువర్ణఘంటాకంకణ-గండపెండేరేత్యాది బిరుదాంకితులైన బ్రహ్మశ్రీ కొమ్మూరి బాలబ్రహ్మానంద భాగవతారు గారు-రాజమండ్రి.

35 తాళ్ళశంకరయ్యగారు-శివచరిత్రకృతిపతి హైదరాబాద సైదాబాగు

36 పగిడిపాటి సుందరరాజు నాయుడుగారు-పాదుకా పట్టాభిషేకకృతిపతి-మెకానికలింజనీయరు-హైదరాబాద.

37 ఉమ్మడిసింగు ఆదినారాయణరావుగారు-ఏలూరు.

38 ఉమ్మడిసింగు సత్యనారాయణగారు-ఏలూరు.

39 మాకం తిమ్మయ్య శాస్త్రిగారు శ్రీమద్గీతాలయము-మదరాసు.

40 నంబూరి కృష్ణమూర్తి శాస్త్రిగారు-శికిందరాబాద.

41 తాడిచెట్టు రామయ్య శాస్త్రిగారు-శికిందరాబాద

42 సాత్వేరు పాపయ్య, రామయ్య బ్రదర్సువారు శికిందరాబాద

43 రంగధామరావు నాయుడుగారు-రిటైర్డు యింజనీయరు-సత్య-వి-ధర్మ
కార్యపరతంత్రులు-హైదరాబాద.

44 గోలి నాగభూషణం శాస్త్రిగారు-శికిందరాబాద.

45 పొన్నాల అంతయ్యగారు-శికిందాబ్రాదు.
46 పురుశెట్టి నాగేశ్వరరావుగారు-శికిందాబ్రాదు.
47 రాయవరపు అప్పాదొరగారు-టిక్కెట్టుయినస్పెక్టరు-బరంపురం.
48 రాయవరపు రంగనాయకులుగారు-చీఫ్‌యినస్పెక్టరు-ఏలూరు.
49 రాయవరపు సూర్యనారాయణజమిదారుగారు-ఏలూరు.
50 మెంటే కృష్ణారావుగారు హాస్పిటల్ ఏలూరు
51 సిరిపల్లి కృష్ణమూర్తిగారు-ఏలూరు.
52 దండుబోయిన వెంకటనారాయణగారు-ఏలూరు.
53 నున్నా నాగభూషణంగారు-ఏలూరు.
54 కోసన అప్పలస్వామిగారి పుత్రులుచిన్నఅప్పలస్వామిగారు,
ముస్సీఫలుకొన్సిలరు-కాకినాడ.
55 పుప్పాల కృష్ణమూర్తినాయుడుగారు-కాకినాడ.
56 రోళ్ళ సీతారామయ్యనాయుడుగారు, బి. ఏ.-కాకినాడ
57 కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు-కాకినాడ.
58 పవరాల కృష్ణారావునాయుడుగారు, బి. ఏ. బి. ఎల్.-కాకినాడ.
59 రెడ్డి కోటయ్యగారు-పత్తేబాద.
60 కమ్మిలి అప్పన్నగారు-ఏలూరు.
61 కమ్మిలి తిరుపతిరాయుడుగారు-ఏలూరు.
62 వీరమాచునేని సత్యనారాయణగారు-పోతునూరు.
63 జంపా పాకాలరావుగారు-ఏలూరు.
64 తవ్వా సర్వేశ్వరరావుగారు ఏలూరు
65 కంది కాశీగారు ఏలూరు
66 శీలం సుబ్బయ్యనాయుడుగారు-హుజూరు సిరస్తాదారు ఏలూరు
67 పాలి వెంకటమునియ్యగారు శ్రీ పాండురంగప్రెస్ ఏలూరు
68 అడ్డేపల్లి కొండయ్యగారు కైకరం
69 ఊరిటి బలరామదాసు బ్రదర్సువారు ఏలూరు
70 జి. పి. రాజుగారు ఏలూరు
71 షిర్తైఖన్ సత్యనారాయణగారు ఏలూరు
72 పేరక కోటయ్యగారు పత్తేబాద
73 వాల్మీకి శ్రీహరిగారు, ఫిడలిస్టు-చాటపర్రు.
74 జి. పి. యస్. సంగీతరావుగారు, టాకీడయిరెక్టరు-తెనాలి.